శ్రీ గురుభ్యోన్నమః

శ్రీ సద్గురు స్వామి భానుమతమ్మ కృత

# శరన్నవరాత్రులు - ఆధ్యాత్మికదృష్టి




వేదాంత విద్వాన్

శ్రీ స్వామి రామనాథంగారి శిష్యులు

సద్గురు భానుమతమ్మ గారిచే ప్రతిపాదింపబడి

వివరింపబడెను.

వెల : 12-00

శ్రీ గురుభ్యోన్నమః

కృతజ్ఞత

"శరన్నవరాత్రులు - అధ్యాత్మికదృష్టి" యను ఈ గ్రంథ ముద్రణకు ధర్మ ప్రచార గ్రంథ రచయితల ప్రోత్సహించు పథకము ననుసరించి శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల యాజమాన్యము వారు 8150/- (ఎనిమిది వేల నూట ఏబది రూపాయలు) భూరి విరాళము నొసగిరి. ఇందులకు ముఖ్య కారకులైన తిరుమల తిరుపతి దేవస్థానము కార్యనిర్వాహణాధి కారి మాన్యశ్రీ M.V.S. ప్రసాదు I.A.S. గార్కి మరియు సప్తగిరి సంపాదకులు శ్రీ కె. సుబ్బారావు M.A. గార్కి తదితర అధికార బృందమునకు నా ప్రత్యేక కృతజ్ఞతలు. "ధర్మోరక్షతి రక్షితః" అను సూక్తి ననుసరించి ధర్మరక్షకులైన వారికి శ్రీ శ్రీని వాసుడు సర్వాభీష్టములను నెరవేర్చుగాత.

పి. భానుమతి



This book is Published with the Financial assistance of Tirumala Tirupathi Devasthanams under their scheme Aid to Publish Religious Books.

P. Bhanumathi
30/9/92



శ్రీ సద్గురు స్వామి రామనాథ్

(శ్రీ బొమ్మకంటి లక్ష్మీనరసింహ మూర్తి గారి శిష్యులు)



# శ్రీ సద్గురు భానువంతమ్మ

( శ్రీ స్వామిరామనాథ్ గారి శిష్యులు )

శ్రీ గురుభ్యోన్నమః

## మనవి.

పాఠక మహాశయులారా!

అనేక విదేశీ దండయాత్రల మూలంగా అణుగునబడి కొన ఊపిరితోనున్న భారతీయ సంస్కృతిని పునరుజ్జీవింప జేయుటకు యెందరో మహనీయులు కృషిచేశారు. సద్గురు స్వామి రామనాథ్‌గారి కృపతో మన పండుగలు వీని ఆచరణలో 'ఆధ్యాత్మిక దృష్టి' అనే అంశంపై నాకు తెలిసిన విషయాలను యీ పుస్తక రూపంలో వెలువరిస్తున్నాను. గురుదేవుల నొకసారి గురుదక్షిణ విషయమై ప్రస్తావించగా వారు "నీకు తెలిసిన విషయాలను నలుగురికి చెప్పమ్మా. అదే నాకిచ్చే గురుదక్షిణ. అన్నారు. ఈ చిన్న పుస్తకంలోని విషయాలు సహృదయంతో అర్థం చేసికొని యెవరైనా దాని వలన లాభం పొందితే అది నా గురుదేవుల కిచ్చిన దక్షిణగా భావిస్తాను. ఇందులో ఇంకను చేర్చవలసిన, తొలగించవలసిన విషయములేవైనా ఉన్న నాకు తెలిపిన కృతజ్ఞతతో వానిని సవరించుకొనగలనని వినయ పూర్వకంగా మనవి చేసుకుంటున్నాను. మనం పండుగలను క్రొత్త బట్టలు కట్టుకోటానికి పిండివంటలు చేసుకొని తినటానికి చేసుకుంటున్నాము. ఆ పండుగనుద్దేశించి ప్రాచీనమైన కథ నొకదాన్ని చెప్పుకొని అందుకే దీనిని ఆచరిస్తున్నామనుకుంటు న్నాము. కాని ప్రతిపండుగ వెనుక వ్యక్తిని తీర్చిదిద్దే ప్రణాళిక ఏర్పాటు చెయబడింది. శరన్నవరాత్రులు–ఆధ్యాత్మిక దృష్టి అనే ఈ పుస్తకంలో దసరా పది దినములలో జరిగే వ్యక్తి

ర్మాణము విశదీకరించబడినది. గుణాతీతుడైన సద్గురు పాద
ద్మములకు గుణాతీతుడెట్లు కావలెనో తెలియజేయు ఈ
స్తకమును అర్పించుకుంటున్నాను. ఈ పుస్తకమును
ద్రించుటకు అర్థికముగను, కాయిక, వాచిక, మానసికము
ను సహాయము చేసి తమ వంతు బాధ్యతను పూర్తిచేసుకొని
రుఋణము తీర్చుటలో భాగస్వాములైన శ్రీ సద్గురు స్వామి
మనాథ వేదాంత ప్రచారమండలి సభ్యులకు సద్గురు కృపచే
త్మానందము ప్రాప్తించుగాక!

నమస్సులతో
గురుపాదరేణువు
భానుమతి
7-8-91

శ్రీ గురుభ్యోన్నమః

# తొలిపలుకు

జననం, మరణం, జీవితం ఈ మూడింటి అర్థంయేమిటి? ఈ సృష్టికంతటికి మూలకారకుడయిన భగవంతుడెవరు? నేను ఎవరు? భగవంతుడికి, జీవుడికి (నాకు) సంబంధంవుందా? పుట్టకముందు తానెవరు? జీవించినవాడు మరణించిన తరువాత యేమవుతున్నాడు? ప్రతివారికి ఈ ప్రశ్నలు ఎప్పుడో ఒకపుడు ఉదయించక మానవు. జవాబు తెలుసుకోవాలనే ఉన్నా సమయం చాలకనో సమాధానం చెప్పేవారు తటస్థపడకనో ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోతూ ఉంటుంది.

ఎంతోమంది మేథావులు, మరెన్నో శాస్త్రాలు మతాలు, ఈ విషయాన్ని చర్చిస్తూనే వున్నారు.

శ్రీ శంకర భగవత్పాదుల అద్వైతానికి ఈనాడు ప్రపంచమంతటా ఒక విశిష్టస్థానం ఉంది. ఆ మహామహుడు పుట్టిన దేశంలో పుట్టామని సగర్వంగా చెప్పుకోడానికి ఆయన చెప్పిన దానిని అర్థం చేసుకోవడం అత్యావసరం అనిపిస్తుంది. శబ్దజాల మహారణ్యమనదగిన శాస్త్రసముదాయాన్ని పఠించి, మథించి సారాన్ని గ్రహించే సహనం, సమయం లేనివారికి ఈ అద్వైత సారాన్ని శ్రీ శంకరుల మేథావిభవాన్ని క్లుప్తంగా, సులభగ్రాహ్యంగా చెయ్యాలనే సంకల్పంతో పూజ్య గురుదేవులు, సద్గురువులు సచ్చిదానందస్వరూపులయిన శ్రీమతి పి. భానుమతి గారి ప్రయత్నమే ఈనాటి

''శరన్నవరాత్రులు - ఆధ్యాత్మిక దృష్టి''

పూజ్య గురుదేవులు భానుమతిగారు, పూజ్యపరమగురువు
న సద్గురువు శ్రీ రామనాధం గారి శిష్యులు శ్రీ గురుదేవులు
దాపు 15 సంవత్సరముల నుండి అద్వైత ప్రచారంలో,
ందూసనాతన ఋషి ధర్మపునః ప్రతిష్టాపన మహాయజ్ఞంలో
పూర్వ త్యాగపూరిత సేవలొనర్చుచున్న మహనీయులు.

మన ప్రాచీన ఆచారాలు, సంప్రదాయలు పై ప్రశ్నలకు
మాధానం గ్రహించే స్థితికి జీవుని పెంచటానికై ఉద్దేశింప
ినవి. వానిలోని అంతరార్థాన్ని గ్రహించలేక పోవటంవలన
ి కేవలం బాహ్యమైనవిగా పరిగణించబడుతూ అన్య
తముల వారిచే అవి మూఢ నమ్మకాలుగా అనిపించుకుంటూ
్నాయి. మానవుడు శరన్నవరాత్రుల పేరుతో మహాకాళి,
హాలక్ష్మి, మహా సరస్వతులనెందుకు ఉపాసిస్తున్నాడో, ఎలా
పాసించాలో దానికర్థమేమిటో యిందు సూచించబడినది.
ందులో చెప్పినట్లు ఆచరించి మానవుడు మాధవత్వాన్ని,
్వార దివ్యత్వాన్ని పొందాలని గురుదేవుల సంకల్పము.

పదిదినముల దసరాపండుగలో మొదటి మూడురోజులలో
ళిని పూజించి మనలో ఉన్న తమోగుణాన్ని పోగొట్టుకొని
ంవాత మూడు దినములు లక్ష్మి ఉపాసనచేసి రజోగుణమును
ర్చుకొని చివరి మూడురోజులు శుద్ధసత్వంలో నిలచి జ్ఞానంకై
యత్నించాలి. విజయదశమి రోజు దేవి విజయం సాధించిన
ం. అనగా జీవుడు త్రిగుణాలను వదలి ఆత్మగా ''జీవో
హ్మైవానాపరః'' అను వాక్యాన్ని అనుభవపూర్వకంగా సాక్షత్
బ్రహ్మ స్వరూపంగా మిగిలిపోవడమే విజయదశమి.

సాధకులకు ఈ చిన్న పొత్తం చదివేముందు ఒక చిన్న
వి. చిన్న పుస్తకమని త్వరగా చదివేయ్యకండి. ఈ

ములోని ప్రతివాక్యం లోతైన భావములతో నిండియున్నది
్తగ పఠించి, మననం చేయండి. విషయమును చక్కగా
నుకొనుటకు ప్రయత్నించండి. ముఖ్యంగా ధ్యానసాధనలో
చిన్న అడుగులు వేస్తున్న వారికి ఈ చిన్న పాత్రం
రించగలదు. తొందరపడి వెనకకు నెట్టబడవద్దు.
తంగా సాధకుడు ముందుకు పయనించ వలసినదిగా
న్నాము. పూర్ణశాంతి, ఆనందములు మన జన్మహక్కు
లో వివరించిన సలహాలతో ధ్యానసాధన గావించు
లకు విజయం తథ్యం.

గుణరహిత తత్వంలో సగుణరూపి అయిన సర్వేశ్వరుడు
తా విభిన్న నామరూపాలతో గోచరిస్తున్నాడు. సర్వజ్ఞుడు
క్తి సమన్వితుడు సర్వవ్యాపి అయిన భగవంతుని చేరే
యేమిటి? మతాలు, మహర్షులు అందించే సందేశం
ంగా వారు చూపే బాటలో పయనిస్తూ, దైవ కృపకోరి
, జీవించే అసంఖ్యాక సమకాలీన సాధకుల పుణ్యఫలమే
సద్గురువుగా మూర్తిభవిస్తుంది. గురువే కర్మఫలం, పుణ్య
దైవ స్వరూపం.

శాస్త్ర గురు, దైవముల ఆశీర్వాద అభిమానములు నిండుగ
లకు అందుగాక.

ఓం తత్సత్

ఓం శ్రీ గురుభ్యోనమః
సద్గురు స్వామిరామనాథ వేదాంతప్రచారమండలి
కర్నూలు.

# ధ్యాన శ్లోకములు.

శ్లో॥ అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురువేనమః॥

శ్లో॥ సదాశివ సమారంభం శంకరాచార్య మధ్యమాం।
అస్మదాచార్య పర్యంతాం వందే గురు పరంపరాం॥

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురువే నమః॥

శ్లో॥ నిత్యానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం।
విశ్వాతీతం గగన సదృశం తత్వమస్యాది లక్ష్యం॥

శ్లో॥ ఏకం నిత్యం విమలం అచలం సర్వధీ సాక్షిభూతం।
భావాతీతం త్రిగుణ రహితం సద్గురుంతం నమామి॥

శ్లో॥ ఓం సహనావవతు సహనౌ భునక్తు సహవీర్యం।
కరవావహై తేజస్వి నావధీతమస్తు మా విద్విషావహై॥

ఓం శాన్తి, శాన్తి, శాన్తిః

శ్రీ గురుభ్యోన్నమః

# శరన్నవరాత్రులు - ఆధ్యాత్మిక దృష్టి



భారత దేశంలో విభిన్న జాతులు, విభిన్న మతములు, విభిన్న వర్ణములున్నను భిన్నత్వంలో ఏకత్వం సాధించేందుకు ఒక చక్కని సంస్కృతి కలదు. ఆ భారతీయ సంస్కృతి అంతర్వాహినియై అందరినీ ఏకీకృతం చేస్తుంది. అట్టి సంస్కృతులు మన పూర్వుల వలన మనకు పరంపరగా లభించిన సంపద. దానిని సంరక్షించుకొనుట, భావితరముల వారి కందించుట మన బాధ్యత. భారతీయ సంస్కృతి కారణంగానే భారతదేశము కొన్ని శతాబ్దాల కాలము మహమ్మదీయుల, ఆంగ్లేయుల పాలనలో దాస్యము ననుభవించినను నేటి కింకను హైందవ ధర్మము, మానవ మతము జీవించి యున్నది. అనుశ్రుతంగా వచ్చిన ఆచారాలు పరంపరాగతంగా వచ్చిన పండుగలు మన జాతికి జీవగఱ్ఱలు. ఒక త్రాటిపై యీ జాతిని నడిపించగల సామర్థ్యం మన సంస్కృతికి కలదు అట్టి ధర్మ పరి రక్షణ కెవరు పూనుకొందురో వారినా ధర్మము రక్షించునని " ధర్మోరక్షతి రక్షితః " అను సూక్తి ద్వారా మనం గ్రహించాలి.

మన ప్రాచీనులు శరన్నవరాత్రిని ఎట్లాచరించవలెనో దాని ప్రాముఖ్యమేమో తామాచరించి మనకు భోధించిరి. రాక్షసులకు వారి రక్తబిందువు నేలపై బడగానే రేణువులెన్ని

తడియునో అంతమంది రక్కసులు తిరిగి, జన్మించునట్లు బ్రహ్మ వరము కలదు. అట్టి రక్కసులు సృష్ట్యాది నుండి నేటి వరకు జన్మిస్తునే వున్నారు. జగత్తుకు వారి వలన బాధ కలుగుతూనే వుంది.

యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం

ధర్మమునకెవుడు గ్లాని, అధర్మమునకు వృద్ధి సంభవించునో అపుడు భగవానుడు అవతారమెత్తి అధర్మము నణచి ధర్మపరి రక్షణ చేయును. కొంతకాలము గడచిన తర్వాత అధర్మము తిరిగి మొలకెత్తుటయు ధర్మాధర్మములకు తీవ్ర సంఘర్షణ యేర్పడుటయు, మనము చరిత్రలో చూచుచున్నాము. మహిషాసురులు, శుంభనిశుంభులు, చండ ముండాసురులు, దుశ్శాసన కీచకులు, నాడే కాదు, నేడు కూడా సమాజాన్ని పట్టి పీడిస్తున్న విషయము జగద్విదితమే. దేవి ఎప్పుడో రాక్షస సంహారము చేయుటకాదు నేడీ సమాజాన్ని పట్టి పీడిస్తున్న దుష్ట రాక్షసంహారము చేయవలసిన అవసరమెంతైన కలదు. అట్టి దుష్ట ప్రవృత్తి నణచి వేయుట యెట్లో ఈ శరన్నవరాత్రి రూపంగా పెద్దలు మనకుద్బోధించారు.

తన యింటిలో దీపమును వెలిగించి తరువాత దేవాలయంలో వెలిగించ వలెనన్నట్లు వ్యక్తి ముందు తనను తాను సంస్కరించుకొని సమాజ సంస్కరణ పూనుకోవాలి. దసరాపండుగ

పదిరోజులలో వ్యక్తిసంస్కరణ ఎటుల జరుగవలెనో భోధిస్తుంది వ్యక్తి సంస్కరణ జరిగితే ఆ వ్యక్తుల సమూహమే యైన సమాజము తనకు తానే చక్కబడుతుంది. ప్రతివారు తమను తాము సంస్కరించుకోకుండా దేశాన్ని ఉద్ధరించాలని కంకణం కట్టుకుంటారు. అదెలా సాధ్యం? ఈ ధశ రాత్రులలో వ్యక్తి సంస్కరణకు మన పెద్ద లేర్పాటు చేసిన ప్రణాళికను పరిశీలిద్దాం.

సర్వ బ్రహ్మాండ వ్యాపిని చిదేక రస రూపిణీ జగజ్జనని భక్త సంరక్షణకారిణి దుర్గగా అవతరించి అంతర్బహిశ్శత్రు సంహారము చేసి మరల లక్ష్మిగా అవతరించి ఐహికాముష్మికములు కలిగించి అంత్యములో బంధవిముక్తి గావించి సాధకునకు స్వస్వరుపాను సంధానము కలిగించి త్వమేవాహం (నీవేనేను) అను దృఢజ్ఞానము కలిగించి తనలో ఐక్యము చెసికొను సిద్ధాంతమును యీ పండుగ ద్వార మన పెద్దలు ప్రతిపాదించిరి.

భగవంతుడు నిరాకారుడు, నిర్గుణుడు, నిరవయవుడు, ఆది మధ్యాంతరహితుడు, అఖండుడు, అనంతుడు, అవాఙ్మనస గోచరుడు, అనిర్వచనీయుడు అని ఉపనిషత్తులు తెలియజేయుచున్నవి. నిష్క్రియుడైన ఆ పరతత్త్వము తన శక్తిచేతనే సమస్త కార్యములు చేయించుచున్నది. ఆయన శక్తియే దేవీ రూపము ఆమె కటాక్షము వలననే సాధకుడు సాధ్య వస్తువును

పొందగలుగుట జీవుడు పూర్ణత్వాన్ని పొంది మోక్షసిద్ధిని పొందుట జరుగుచున్నది.

ఈశ్వరానుగ్రహ 'దేవ పుంసాం అద్వైతవాసనా' అని అవధూత గీతలో వచింప బడినట్లు దేవి అనుగ్రహం వలననే మోక్షం పొందాలనే కాంక్ష కలుగుతుంది.

'సదేవసౌమ్యేద మగ్రఅసీత్ ఏకమేవా ద్వితీయం బ్రహ్మ' అన్న ఉపనిషద్వాక్యాన్ననుసరించి 'సత్' పదార్థమైన పరమాత్మ తత్వమే సృష్టికి పూర్వముండేదని, అది రెండవ పదార్థమేలేని ఏకేక వస్తువని తెలుస్తున్నది. తరువాత సృష్టింపబడిన ఈ సమస్త పదార్థములు (జీవరాసులు) ఆ సత్తా అధారంగానే వచ్చాయని తిరిగి అందులోనే లయమవుతున్నాయని అన్ని జాతులవారు విభిన్న రూపాలలో అసత్తానుసేవిస్తున్నట్లు చరిత్ర వలన మనకు తెలుస్తున్నది.

> ఏతస్మాదాత్మనః ఆకాశ స్సంభూతా ఆకాశాత్ వాయుః వాయురగ్నిః అన్న వాక్యాన్ననుసరించి ఆ సత్తారూపమైన బ్రహ్మము నుండి ఆకాశము, దాని నుండి వాయువు

ఆ వాయువు నుండి అగ్ని, ఆ యగ్ని నుండి జలము, దాని నుండి పృథ్వియను పంచ భూతములు క్రమముగా వచ్చెను. మన దేహాలు గూడ ప్రకృతి నుండి వచ్చినదని తిరిగి ప్రకృతిలోనే లయమౌతుందని అన్ని మతాలవారు విశ్వ

సిస్తున్నారు. పంచభూతములైన పృధివ్యాపస్తేజో వాయురాకాశములలో ఏ భూతము నుండి దేహం వచ్చిందని నమ్మేవారు తిరిగి ఆ భూతంలోనే దేహాలను లయంచేస్తున్నారు. ఈజిప్టులో మరణానంతరం ఆ శవాన్ని నైలునదిలో వేస్తారట. అంటే జల తత్వం నుండి వచ్చిన ఈ దేహాన్ని జలానికే అర్పిస్తున్నారు మరికొన్ని దేశాలలో ఆకాశ స్తంభము నందు శవాన్ని ఉంచుతారట. వాయు భూతం నుండి వచ్చిన దేహం మళ్ళీ వాయువులోనే అంతర్లీనము కావాలని వారి ఉద్దేశ్యము. కొందరు దహనం చేయుట మనము చూస్తున్నాము. అగ్నితత్వం నుండి వచ్చిన దేహాన్ని అగ్నికే అహుతి చేయాలన్నది వారి సిద్ధాంతము మరి కొందరు పృధ్వీతత్వం నుండి వచ్చినదని ఈ దేహాన్ని పృధ్విలో ఖననం చేస్తారు. ఇంకా కొందరు అకాశతత్వం నుండి వచ్చినదని నమ్మేవాళ్ళు పిరమిడ్లు కట్టి దానిలో శవాన్ని ఉంచుతారు. వివిధములైన ఈ మరణ సంస్కారిన్ని గమనిస్తే పంచ భూతముల నుండి ఈ పాంచ భౌతికమైన దేహం వచ్చిందని తిరిగి వాటిలోనే చేరుతుందనీ మానవుల విశ్వాసమున్నట్లు తెలియుచున్నది. కులమేదైనా, మతమేదైనా, మార్గాలేవైనా మానవులందరికీ దేహం పంచ భూతాత్మకమైన ప్రకృతి నుండి వచ్చిందన్న విశ్వాసం మాత్రం ఒకటే ఇది మానవ మతం. ఇది ఆధారంగా ఎవరూ ఏమతావలంబకులైనను అంతరంగా అందరూ ప్రకృతి ఉపాసకులేనని స్పష్టమౌతున్నది.

మన దేశంలో ఆ ప్రకృతినే శివ స్వరూపంగా శైవులు, విష్ణు స్వరూపంగా వైష్ణవులు, శక్తి స్వరూపంగా శాక్తేయులు,

గణపతి గాగాణాపత్యులు, సూర్యశక్తిగా సౌర్యులు ఉపాసిస్తున్నారు. బెంగాల్, అస్సాం రాష్ట్రాలలో శాక్తేయులు, తమిళనాడు, మహారాష్ట్రలలో గాణాపత్యులు, ఉత్తరహిందుస్థానంలో వైష్ణవులు, దక్షిణంలో ఆంధ్ర, కేరళ రాష్ట్రాలలో శైవులు తమ తమ మతానుసారం ప్రకృతినే ఉపాసన చేస్తున్నట్లు తెలుస్తున్నది. బెంగాల్‌లో శాక్తేయులకు దుర్గాసప్తశతి నిత్య పారాయణ గ్రంథము. దానిలో ఋషిమేదుడనే మహర్షి మనస్సును, దాని వ్యవహారాలను సురధుడనే రాజునకు సమాధి అనే వైశ్యునకు బోధిస్తాడు.

మన మనస్సు చాలా చిత్రమైనది. ఎవరి వలన దానికి బాధ కలిగిందో వారిని మరచి పోవటానికి బదులు పదేపదే వారిని గురించే ఆలోచిస్తుంది. దీనినే మనవారు 'మాయ' అన్నారు. దానిని విస్మరించటానికి మనం ప్రయత్నిస్తున్నామో మనస్సు దాని మీదనే లగ్నమగుట మాయా కార్యము. ఈ జగత్తులో ఉన్నది లేనట్లుగ లేనిది ఉన్నట్లుగా కనిపింపజేయుట దాని లక్షణము. కనిపించిన దానిపై భ్రాంతి కలిగించుట దాని గుణము. అదే దివ్యమైన మాయ తిరుగుతూ ఉన్న భూమి తిరగనట్లును, కదలని సూర్యుడు కదులుచున్నట్లును మన అనుభవమునకు వచ్చుట ఈ మాయాకార్యమే. మనం రైల్లో ప్రయాణం చేసేటప్పుడు మనముందున్న చెట్లు కదలనివే అయినను వెనుకకు పరుగెత్తుచున్నట్లు కనిపించుట అనుభవమే కదా. ఈ మాయకులోనై హిరణ్యకశిపుడు విష్ణువు వలన తన

సోదరునకు మృతి సంభవించినదని తన మనస్సునకు బాధ కలిగించిన విష్ణువును అనునిత్యము స్మరించుట ఇందుకు తార్కాణము. ఈ దృష్టిని మార్చుకోగలిగితే అసలైన పరమాత్మ తత్వం. మనకు బోధపడుతుంది. "దృష్టి జ్ఞానమయం కృత్వాపశ్యేత్ బ్రహ్మమయం జగత్" అనగా మన దృష్టిని జ్ఞానమయం చేసుకుంటే జగత్తులో బ్రహ్మమును చూడవచ్చు. అట్టి జ్ఞాన దృష్టిని మనకు కలిగించుటకే మన పెద్దలు ఈ పండుగల నేర్పాటుచేశారు.

నిత్యజీవితంలో మనకు కనిపించే వస్తుజాలమును గురించి సైన్సు ఎన్నో విషయాలను చెప్తుంది. రసాయనశాస్త్రము ఉదజని, ప్రాణ వాయువుకు (హైడ్రోజన్, ఆక్సిజన్) వాటికి ఇతర మూలకాలకు వాటి మిశ్రమాలకు ఉన్న సంబంధం తెలుపుతుంది కాని అసలు ప్రాణవాయువేమిటో, అదెలా పుట్టిందని అడిగితే ఆ శాస్త్రం మూగబోతుంది. భగవత్ సృష్టి అని తప్పించుకుంటుది. అలాగే భౌతిక శాస్త్రము రెండు వస్తువుల పరస్పర ఆకర్షణను వర్ణిస్తుంది. వస్తువులు అణువుల సముదాయములని పరమాణువులు శక్తి సముదాయాలని చెప్పుందేకాని ఆశక్తి ఎక్కడ దన్నపుడు 'నేచర్' అని తప్పించుకుంటుంది. భౌతిక శాస్త్రవేత్త ప్రతి వస్తువు అణు నిర్మితమైనట్లే తన కుమారుడు కూడా అణుసముదాయమని తెలిసినప్పటికీ కూడా ఆ కుఱ్ఱవానిని ముద్దాడేటపుడు తనకు కలిగిన మోహశక్తిని అతనిలో నున్న సమ్మోహశక్తిని గ్రహించలేకున్నాడు.

జ్ఞానం తేహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః
యత్జ్ఞాత్వానేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే (గీత 7-2)

పరమాత్మ గీతలో ఏ జ్ఞానం తెలుసుకున్న ఈ జగత్తులో మరియొకటి తెలుసుకొనవలసిన అగత్యముండదో ఆట్టి జ్ఞానాన్ని అర్జునునకు బోధచేశాడు. అందుచే గీతాశాస్త్రము అన్ని శాస్త్రము లకు మూలం.

మనకు గోచరిస్తున్న ఈ జగత్తుకు ఆధారము ఏదో ఒకటి ఉండాలి. మన మనస్సుల మీద ఇట్టి ప్రభావాన్ని కల్గించేది ఏది? అధ్యాత్మిక వేత్తలు దానినే దైవము లేక అత్మ(బ్రహ్మము) అన్నారు. ఇంద్రియాలకు గోచరించే జగత్తు నిజంగా అలా లేదని అసలు ఎలా ఉందొ తెలుసుకోటానికి మన ఇంద్రియా లకు శక్తి చాలదని ఒక ఉదాహరణ ద్వారా ఋజువగుచున్నది భౌతిక శాస్త్రవేత్త ఒక రాతిని పరీక్షించి ఆ రాయి బరువుగా నున్నదని, చిన్నగానున్నదని, గట్టిగానున్నదని దానిని వర్ణిస్తాడు ఆరాయి తనకంటె తక్కువ బరువు కలిగిన దానికంటె ఎక్కువ బరువుగాను, తనకంటె ఎక్కువ బరువు గలిగిన దానికంటె తేలికగానో తొసునది. అసలు బరువు తేలిక అనునది వేరొక దానితో పోల్చినపుడు తెలియుచున్నదే కాని దాని సహజతను తెలియజేయుట లేదు. వేరొక వస్తువు కంటె ఇది గట్టిగాను మరొకదాని కంటె ఇది బరువుగాను ఉండగలిగినదని నిర్ణయి స్తున్నాము. బరువు గట్టిదనము ఇత్యాది గుణములు తోసిన రాయి ఎలా ఉంటుందని అడుగగా భౌతిక శాస్త్రవేత్త కళ్ళుతేల

వేయును, నిత్యజీవితంలో అనుభవమయ్యేది ఏ దీ కూడ మాటలలో చెప్పనలవికాదు. అందుచే వానిని ఆధ్యాత్మికవేత్తలు అనుభవైక వేద్యమని, అనిర్వచనీయమని అంటారు. పంచదార ఎలా ఉంటుందని ఎవరైనా అడిగితే తీయగా ఉంటుందని సమాధానము చెబుతాము. తీపి ఎలాఉంటుందన్నప్పుడు అనుభవైక వేద్యమేనని ఆ అనుభవము లేనివాళ్ళు ఆ వస్తువును గుర్తించరు. వారు గుర్తించనంత మాత్రాన అది లేదనటానికి వీల్లేదు. అలాగే అనుభవం లేనివాళ్ళు దైవము లేదంటారు. అనుభవజ్ఞుడుసర్వమూ దైవమేనంటాడు. అనుభవజ్ఞుడు పరమాత్మ సచ్చిదానంద స్వరూపుడని ఆయనలో నిమిత్తకారణము తత్కార్యము నిండియున్నదని, ఏ శక్తి కారణాన్ని కార్యంగా మారుస్తుందో అట్టి శక్తినే మాయాశక్తి అంటారని, ఆ శక్తియే ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి రూపంగా తనలో కలిగిన ఉద్వేళన వలన పరిణమిస్తుందని అంటారు. ఆశక్తి అవ్యక్తంగా ఉండి ఉపాధులతో చేరినప్పుడు వ్యక్తమోతుందని క్రియా రూపాన్ని ధరిస్తుందని ఒక ఉదాహరణ ద్వారా మనం గ్రహించవచ్చు. విద్యుచ్ఛక్తి తీగలో అవ్యక్తంగా ఉంటుంది. అదే ఫ్యాన్ పెట్టినపుడు గాలినిసుంది. బల్బు పెట్టినపుడు వెలుగుతుంది. ఇస్త్రీపెట్టెలో వేడినిస్తుంది. బట్టలు వుతికే మెషిన్‌లో బట్టల మురికి పోగొడుతుంది. దీనిని బట్టి విద్యుత్‌లో వాయు, ఉష్ణశక్తులు నిక్షిప్తంగా ఉన్నవని (అవ్యక్తంగా) అని వ్యక్తమైనపుడు మాత్రమే మనము గుర్తించగలుగుతున్నాము. శక్తిని శక్తివంతుని విడదీయటానికి వీలులేదు. పాలు దాని

తెలుపు, అగ్ని దాని ఉష్ణదాహక శక్తులు ఎట్లు విభజించుటకు వీలుకాదో అట్లే పరమాత్మ ఆయన మాయ విభజించుటకు వీలులేనివి.

మన మనస్సుకు భ్రాంతిని కలిగించి మన విచక్షణా జ్ఞానాన్ని పోగొట్టి ఉన్న ఒక్క పదార్థమును బహుగా కనిపింప జేసి ఉన్నది లేనట్లుగా, లేనిది ఉన్నట్లుగా తోచునట్లుచేసే ఆ దివ్య మాయకే 'మహామాయ' అని దాని ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులకే, సృష్టి, స్థితి, లయాలు కార్యాలని పెద్దలు తెలియజేస్తున్నారు. మాయ బ్రహ్మము ఒకే నాణానికి బొమ్మ బొరుసుల వంటివి. జగత్తు నుండి బ్రహ్మమును తీసివేస్తే ఏమిలేని మాయయని (జగత్తు—బ్రహ్మము = మాయ) 'యామసా మాయ' ఏమిలేనిది మాయయని అనుభవజ్ఞులు వక్కాణి స్తున్నారు. పరమాత్మ గీతలో

దైవీ హ్యేషాగుణమయీ మమమాయా దురత్యయా
మామేవయే ప్రపద్యంతే మాయామేతాంతరంతితే''

(గీత 7-14)

ఈ గుణమయమైన మాయను నన్ను శరణు పొందిన తప్ప మెవరును దాటలేరని చెప్పాడు. దీనిని కల వారింటి కుక్కతో పోల్చవచ్చును. ఆ ఇంటివారు రానంత వరకూ ఆ కుక్క మనపై కెగబడి మనలను క్షోభపెట్టును. ఆఇంటివారు రాగానే మనచుట్టూ తోక ఆడిస్తూ తిరుగును. అట్లే ఈ మాయ విశ్వభ్రాంతి కలిగించి సంసార చక్రంలో త్రిప్పి పరమాత్మను

శరణు పొందగనే విశ్వ విమోచనకారిణియై ముక్తిని ప్రసాధిస్తుంది. అందుచే ఆ మాయను విద్యామాయ, అవిద్యామాయ అని రెండు రూపాలుగా అర్థం చేసుకోవచ్చు. త్రాగుబోతు, వ్యభిచారి, జూదరి, లంచగొండి తాము చేస్తున్న పనులు అధర్మమని అనర్థదాయకాలని తెలిసి కూడా ఆ తప్పును మరల మరల చేయడం ఈ మాయ యొక్క కార్యమే అవుతుంది. పరీక్షలో కాపీ కొట్టే విద్యార్థి దాని పరిణామాలు తెలిసికూడా ఆ పని చేస్తున్నాడంటే, అతనికి నిర్లక్ష్యాన్ని కలిగించి, అధర్మ కార్యానికి దోహదం చేసేది ఈ మాయశక్తియే తప్పు తెలియక పోవటంవలన దానిని ఆచరించే దానికంటే తెలిసి ఆ తప్పును చేయటం పెద్ద నేరమే అవుతుంది. నేడు నేరస్థులలో అధికశాతం తెలిసి తప్పుచేసిన వారే. వారలా చేయడానికి కారణము వారిలో విచక్షణా జ్ఞానలోపమే. అంతేకాని అది వారి దోషము కాదు. అట్టి విచక్షణా జ్ఞాన లోపంవలననే నేడు సమాజంలో దుశ్శాసనులు, కీచకులు అధికమగుచున్నారు. ప్రభుత్వం నేరస్థుల నెంత కఠినంగా శిక్షించినా వారిలో నేర ప్రవృత్తి మరింత శిక్షల వలన పెరుగు చున్నదే కాని మనో పరివర్తన వచ్చుట లేదు. విచక్షణా జ్ఞానాన్ని ప్రతివారిలో ఉద్దీపింపచేయుటయే మన పెద్దలేర్పాటు చేసిన ఈ దేవీ నవ రాత్రుల కర్థం.

మట్టి కుమ్మరి వాని చేతిలో కుండగా మలచబడుతుంది మట్టిలో నున్న ఒక సాగెడు శక్తియే (జిగురు) కుండయగు చున్నది. మట్టిలోని జిగురుశక్తి కుండ రూపము ధరించుటకు కులాలుడు నిమిత్తకారణుడగుచున్నాడు. ఉపాదాన కారణ

మైన మట్టి యేకార్యమైన కుండ రూపము ధరిస్తున్నది. అట్లే సద్రూపమైన బ్రహ్మములో నున్న చిద్రూపశక్తియే జగద్రూపముగా గోచరిస్తున్నది. ఇలా సద్రూపమైన బ్రహ్మము ఉపాదాన కారణమైన మట్టిగను, చిద్రూపమైన జగత్తు కార్యమైన కుండగను ఊహించుకొని అర్థము చెసుకొనవలెను. నిమిత్త కారణుడు ఈశ్వరుడగుచున్నాడు. కులాలుని పాత్రను ఇక్కడ ఈశ్వరుడు స్వీకరిస్తున్నాడు.

"యాదేవి సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా" అన్నట్లు ఆ చిద్రూపిణియైన పరాశక్తియే జగత్తులో మాతృమూర్తిగా అవతరించింది. అన్ని దేహములు స్త్రీ స్వరూపములని అందులోగల దేహి ఒక్కడే పురుషోత్తముడని భగవానుడు గీతలో

క్షేత్రజ్ఞం బాపి మాంవిద్ధి సర్వక్షేత్రేషు భారత
క్షేత్ర క్షేత్రజ్ఞ యోర్జ్ఞానం యత్తత్ జ్ఞానం మతంమమ
(గీత 13-2)

ద్వావిభే పురుషే లోకే క్షరశ్చాక్షర ఏవచ
క్షరస్సర్వాణి భూతాని కూటస్థాఽక్షర ఉచ్యతే
(గీత 15-16)

అన్ని దేహములందున్న క్షేత్రజ్ఞుడను నేనే. నన్ను తెలుసుకొను యేజ్ఞానము గలదో అదియే నామతము అనియు క్షరుడు, అక్షరుడను ఇరువురు పురుషులలో సర్వ భూతము

లందున్న అక్షరుడను కూటస్థుని తెలుసుకో అని తెలియ బరచాడు. దీనిని బట్టి కనిపించే దేహములన్నియు స్త్రీ స్వరూపాలని అందున్న కూటస్థుడు పురుషుడని ఈ ప్రకృతి పురుషులతో సమ్మిశ్రితమైనదే ఈ జగత్తిని అర్థము చేసుకొన వలెను. తదను సారమే ప్రహ్లాదుడు.

"కన్నుదోయికి అన్యకాంత లడ్డంబైన మాతృ భావన చేసెడి వాడని" పోతన ఈ భావమునే మన కందించి ప్రయత్నించాడు. ఏ దేహము కనిపించినా దానిని చిద్రూప శక్తిగా గుర్తించిన వాడే ప్రహ్లాదుడు. అట్లు ప్రకృతిని చూడ గనే పరమాత్మ చిచ్ఛక్తియని జ్ఞాపకము రాక నాది, నాయిల్లు, నా వాళ్ళు అన్న భావము కలుగుటయే భ్రాంతి. ప్రకృతి పురుషుడు మాత్రమే ఉండగా ప్రకృతి కనిపించగనే ప్రకృతి యనిపించక మరొకలా అనిపిస్తుందంటే అది మన దృష్టిలోపం వల్లనే ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు మనకు కనిపిస్తుంది. ఆ భ్రాంతి కారణంగానే ఉన్న పరమాత్మ మనకు కనిపించుటలేదు. లేని జగత్తు కనిపిస్తుంది. అందుచే ప్రతి ఒక్కరూ దేవుడున్నాడా? ఉంటే కనిపించడేం? అని ప్రశ్నిస్తుంటారు. దేవుని చూడగల శక్తి (అనుభవించగలశక్తి) లేనివాడు అలా మాట్లాడటానికి అవకాశం ఉంది. చక్కెర తిన్న అనుభవము లేనివాడు తీపి ఎలా ఉంటుందంటే ఏ విధముగా తెలుసుకోనలేడో అలాగే భగవత్తత్వాన్ని అనుభవించని వ్యక్తి భగ వంతుని ఉనికిని అంగీకరించలేడు. ఇది అతని దోషం కాదు అతని అవిద్యాదోషం ఏశక్తి అయితే ఉన్నదున్నట్లుగా కనబడ

నీయక భ్రాంతిని కలిగించి అతనికి లేని దానిని ఉన్నట్లుగా చూపించిందో ఆ భ్రాంతి రూపకమైన శక్తియే యిక్కడ 'అవిద్యామాయ' యని చెప్పబడుచున్నది. పరమాత్మను అనుభవ పూర్వకముగా గ్రహించిన పెద్దలెందరో ఆయనను మన చేత కూడ అనుభవింపచేయుటకు ఎన్నో విధములుగా ప్రయత్నించారు. ఒకసారి శ్రీ రామకృష్ణ పరమహంసను వివేకానందుడు 'మీరు దేవుని చూచారా?' అని ప్రశ్నించాడుట. అందుకాయన చూచాను, మాట్లాడినాను, నిత్యం ఆయనతో వ్యవహరిస్తున్నాను అన్నారుట. వివేకానందుడు కుతూహలంగా ''ఆయన ఎలా ఉంటాడు? ఆయన ఆకారమెట్టిది? ఆయనను ఎలా తెలుసుకోవాలి? అని ప్రశ్నించాడు. నీటికి ఒక ఆకారం లేదు. అది ఏ పాత్రలో పోస్తే ఆ పాత్ర ఆకారాన్ని ఎలాపొందుతుందో అలాగే భగవంతుడు కూడా అన్ని ఉపాధులలో (దేహము) నుండి ఆ ఉపాధుల రూపాన్నే తానుకూడా పొందుచున్నాడు. మనచేత చూడబడే జడ, చేతనములన్నియు, ఆ పరమాత్మ యొక్క స్వరూపాలే. ఆయన కంటు ఒక రూపములేదు. కానీ, అన్ని రూపాలు ఆయనవే. ఆయన దృష్టి కంటూ ఒక పేరు లేదు. కాని అన్ని పేర్లు ఆయనవే జ్ఞానమయం కృత్వా పశ్యేబ్రహ్మ మయం జగత్ (తేజబిందూపనిషత్తు 1-29) అని మన దృష్టిని జ్ఞానమయం చేసుకుంటే జగత్తు బ్రహ్మమయంగా గోచరిస్తుంది. ఏ భ్రాంతి కారణంగా చిద్రూపిణియైన ప్రకృతిగృహ ఆరామ క్షేత్రాలుగా అనిపిస్తున దో ఆ భ్రాంతి నశించి ఆత్మతత్వంగా గోచరిస్తుంది. అందుచే జ్ఞానమయమైన దృష్టిని మనం అలవాటు చేసుకోవాలి. అది

ఒక్కసారిగా వచ్చేది కాదు. క్రమపరిణామంలో మనలను మనం సంస్కరించుకుంటూపోతే ఆ దృష్టి అలవడుతుంది. అదే పెద్దలు మనకిచ్చిన సందేశము, మన దృష్టి జీవదృష్టి **అయితే జగత్తంతా జీవమయంగాను,** ఆ జీవులలో కూడా స్వపర భేదముగాను గోచరిస్తుంది. అదే బ్రహ్మదృష్టి అయితే ఆత్మకన్నా భిన్నంగా యేమిలేదని తెలుస్తుంది. పరమాత్మలో నున్న ఆ శక్తియే 'పరమేశ్వరి' యని 'దుర్గ' యని కాళియని వివిధనామాలతో పిలువబడుతున్నది. ఆ తల్లి విశ్వభ్రాంతి విశ్వవిమోచన మనే రెండు కార్యాలు చేస్తూవుంటుంది. పరమాత్మలో శక్తి, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తిగా మూడు రూపాలు ధరిస్తుందని ఇంతకు ముందే చెప్పుకున్నాము. ఆ క్రియాశక్తి రూపాన్ని గూర్చి ఇప్పుడాలోచిద్దాము.

పరమేశ్వరి విశ్వభ్రాంతిని ఎలా కలిగిస్తుందో చూద్దాము. మన కంటితో ఒక వస్తువును చూస్తాము. మనస్సు ద్వారా అది లోపలికి ప్రవేశిస్తుంది. లోవల గల బుద్ధి ఆ వస్తువు యొక్క ఆకారాన్నిపొంది దాని సూక్ష్మీకరింజేసి చిత్తమనే సాగరంలో దాన్ని భద్రంగా దాచిపెడుతుంది. అలా దాచిపెట్టబడిన 'వస్తుస్వరూపాన్నే' 'వాసన' అంటారు. అట్టి వాసనలు అనేక జన్మల నుండి సంప్రాప్తమై మనచిత్తసాగరంలో భద్రంగా దాచిపెట్టబడియున్నాయి. ప్రాణోత్క్రమణ సమయమున (మరణ సమయంలో) ఆ వాసనలే మన ముందు సినిమా తెరపై ఫిల్ము వలె వచ్చి నిలబడతాయి. ఆ వాసనలలో ఏ వాసనపై మన

దృష్టి కేంద్రీకరింపబడుతుందో ఆ జన్మనే తిరిగి మనం పొందు తాము. ఇల్లు ఖాళీచేసేవాడు క్రొత్త యింటిని చూచుకొనివచ్చి ఈ యింట్లో సామానంతా సర్దుకొని, మరల ఒకసారి గూళ్ళన్నీ వెదకి, ఏదీ మరచిపోలేదని నిర్ణయించుకొని ఎలా పట్టుకు పోతాడో అలాగే జీవుడు తన చిత్తసాగరంలో దాచుకున్న వాసన లన్నింటిలో తన దృష్టి కేంద్రీకరించిన వాసనకనుగుణంగా దేహాన్ని ధరించుటకు వెళ్ళేటప్పుడు మిగిలిన తన వాసన లన్నింటిని వెంట తీసుకొని వెళ్ళుతాడు. వాడా సామాను సర్దుకొనే పనిలో నిమగ్నుడై యుండుట వలన మనలను చూచుట మనతో మాటలాడుట వంటి పనులు చేయడు వాని దృష్టి అన్యవిషయమందు లగ్నమగుటవలన పెద్దలు వాడికి మన చూపు లేదని, మన స్పృహలేదని అంటూ ఉండటం మనకు విదితమే. దీనిపై బట్టి ఆలోచిస్తే అనేక వాసనలు మన చిత్తసాగరంలో ఇప్పటికే ఉన్నాయని మనకు దృఢ మౌతుంది. ఎవరికైనా చిత్తసాగరం ఉందో లేదోననే అనుమానం కలిగితే మన చిన్నతనంలో ఆడుకున్న ఆటలు, జరిగిన సన్నివేశాలు, గుర్తుకు తెచ్చుకుంటే కనిపిస్తాయి. మనము ఏచోట కూర్చుని ఏమి మాట్లాడాము, ఎదుటి వారేమి సమాధానమిచ్చారో ఆ సంఘటన ఆ మూలాగ్రం చిత్రం నీ ముందు నిలుస్తుంది. మన చిత్తసాగరంలో అలా ప్రతి మాట ప్రతి సంఘటన సూక్ష్మ రించబడి దాగివుంటుంది. అవసరము వచ్చినప్పుడు మన యెదుటికి తెచ్చి నిలబడతాయి. ఈవాసనలే తన మరో జన్మకు హేతువులవుతున్నాయి. ఏ జన్మలో నో చేసి వుంటాను ఇప్పుడనుభవిస్తున్నాను. ఇది నా కర్మ'' అని ప్రతివాడు

అనటం మనం వింటూనే ఉన్నాము. త్రాగుబోతుకు, వ్యభిచారికి, జూదరికి, కాపికొట్టేవాడికి తప్పని తెలిసినా విచక్షణా జ్ఞాన్ని కోల్పోయి పరీక్షలో ఆ తప్పే ఎలా పదే, పదే చేస్తున్నారో అలాగే కర్మవలన వాసనలు, వాసనల వలన జన్మ, జన్మ వలన మరల కర్మ యిలా చర్విత చర్వణంగా జరుగుతుంది. దానినే పునరపి జననం, పునరపి మరణం పునరపి జననీ జఠరేశయనం, ఇహ సంసారే బహుదుస్తారే కృపయా పారేపాహి మురారీ. (భజగోవిందము) అని శంకరాచార్యులు సెలవిచ్చియున్నారు. అందుచే మనం చూచిన ప్రతి వస్తువును 'వాసన' కాకుండా చేయుటకు ప్రయత్నము చేయాలి. వాసనలే జన్మ హేతువులని తెలుసుకున్నాం కదా? జన్మ లేకుండా వుండాలంటే వాసనలు లేకుండా చేసుకోవాలి.

కర్మ వాసన ఎలా ఔతుందో వాసన కాకుండా ఏం చేయాలో మనం ఇప్పుడు తెలుసుకుందాము. మనం బజారుకు వెళుతూ ఒక అందమైన భవనాన్ని చూచాము. ఆ ఇల్లు చాలా బాగుంది అనుకున్నాము, అంతవరకూ నష్టమేమిలేదు. కాని అలాంటి భవనము నాకు కావాలి అని ఎప్పుడైతే అనిపించిందో అదే వాసన అయింది. సృష్టిలోని ప్రతి వస్తువును చూచి ఆనందించే వరకు ప్రమాదం లేదు. కాని దానిని స్వతం చేసుకోవాలన్న తాపత్రయమే వాసనై కూర్చుంటుంది. పదే పదే దాన్ని స్వంతం చేసుకోవాలన్న బలీయమైన కోరికయే వాసనలను కషాయం చేస్తుంది. తొండ ముదిరితే ఉసరవెల్లి అయినట్లుగా

వాసనలముదురురూపమేకషాయం.ప్రాణోత్క్రమణసమయంలో నీచే చూడబడిన భవనం గుర్తుకురాగా దానినీ జన్మలో సంపాదించ లేకపోతినే అన్న దుఃఖము, దానినెట్లైన పొందవలెనను కోరిక కలిసి మరుజన్మలో అట్టి భవనము కలవారింటిలోపుట్టుట గాని లేక నీవే అట్టి భవనమును కట్టుటగాని జరుగును. భవన నిర్మాణము నీ జన్మకు హేతువైనట్లే నీవు సంపాదించుకున్న అన్ని వాసనలు నీ అన్ని జన్మలకు హేతువులగు చున్నవి. ఎవరైనా బాధలోనున్న వానిని, వికలాంగునిచూచి 'అయ్యో అతడెట్లు బాధపడుచుండెనో కదా' యని సంకల్పించిన అది కూడా వాసనయై అటువంటి జన్మకు కారణ మగును. భాగవతములోని పురంజనోపాఖ్యానములో రాజు తన మరణానంతరము భర్తృహీన యైన స్త్రీ యెట్లుజీవించునో కదాయని తన భార్యను గురించి సంకల్పము చేయుచు దేహము వదలెను. మరు జన్మమున అతడు భర్తను కోల్పోయి ఆ దుఃఖముననుభవించు స్త్రీగా జన్మించి ఆ దుఃఖమునను భవమునకు తెచ్చుకొనెను. జడభరతుడు ప్రాణోత్క్రమణ సమయమున తన పెంపుడు లేడియందు వాత్సల్యము కలిగి యుండుటవలన లేడి జన్మమునే పొందవలసి వచ్చెను వాసనలు చిత్తసాగరము నందుండుట వలన అవి జన్మలకు హేతువులగుచున్నవి. ఎన్నో జన్మలెత్తి, యెత్తి పొట్టకొఱ కెన్నెన్నో పనుల్జేసి యింకెన్నో జన్మములెత్తపాల్పడితి యింకే మేమి కానున్నదో, ఎన్నాళ్ళిట్లు తపింతు వేసరికి నీవే దిక్కు మిత్రాన్వయో త్తమ భద్రగిరేంద్రధామ జయ సీతారామ దేహోత్తమా అని శతకకారుడు చెప్పినట్లు వాసనలచేత జన్మ,

జన్మచేత కర్మ, కర్మచేత తిరిగి వాసనలు తిరిగి జన్మ. ఈ విషయలాను తెలిసికూడా జీవుడనేక జన్మములెత్తుటకు సంసిద్ధుడగుచున్నాడనిన యిది మాయా ప్రభావము కాక యేమున్నది? అట్లయిన దీని కంతెక్కడ? ఏతల్లి విశ్వభ్రాంతికి కారణమైనదో ఆ తల్లియే విశ్వవిమోచన కారిణి. ఆమెనుపాసించిన ఈ భ్రాంతి నుండి విడుదల చేసి విశ్వవిమోచనం కలిగించే విద్యామాయగా రూపొందుతుంది.

ఆ తల్లి కటాక్షం వల్లనే మనకు సద్గురువు సాన్నిధ్యం చేకూరి నపునరావర్తతే తిరిగి జన్మలేని స్థితిని పొందుతాము. ఈ విషయాలను తెలియజేయుటకు చిత్రకారులు భగవంతుని రూపాలను చిత్రిస్తుంటారు. ఆలోచించగా నిరాకారుడైనదేవునకు ఆకార మేమిటి? మనం చూస్తున్న ఆకారంగా దేవుడున్నాడా? అని మనం ఆలోచించవలసి యున్నది. తాననుభవించిన విషయమును చిత్రలిపి ద్వారా ఇతరుల కందించుటకు పెద్దలు చేసిన ప్రయత్నమే ఈ చిత్రావిష్కరణ దేవి ఒక చేతిలో త్రాటిని మరొక చేతిలో ఖడ్గాన్ని పట్టుకున్నట్లు చూస్తాము. 'పాశహస్తా' పాశ హంత్రీ పరమంత్ర విభేదినీయని పరమేశ్వరికి నామాలు కలవు. సంసార చక్రంలో మోహపాశంతో మనలను బంధించిన ఆతల్లియే తన నాశ్రయించిన వారిని తన చేతిలో నున్న ఖడ్గముతో ఆతని ఆవరణను ఛేదించి తనలో ఐక్యం చేసుకొటానికి సహాయ పడుతుంది.

భగవంతుడు నిరాకారుడని, అవాఙ్మానస గోచరుడని అనుభవైక వేద్యుడని ఇంతకు ముందే మనం చెప్పుకున్నాము. శంఖ చక్ర గదాధారియైన విష్ణు రూపము, లింగాకారమైన శివ రూపము ఎట్లు వచ్చెనని మనకు సందేహం కలుగవచ్చు. ఇంతకు ముందు అనుకున్నట్లుగా ఆకాశము, నీరు ఏ ఉపాధి నాశ్రయించిన ఎట్లు ఆ యాకారము సందునో అట్లే సాధకుడు తన భావనా జగత్తులో ఏ రూపము నూహించినను అందు భగవంతుడుండును. అనగా నీరు ఏ పాత్రలో పోసిన ఆ పాత్ర ఆకృతి నందినట్లు కనిపించునట్లే భగవానుడాయా రూపముల నందును. నిజంగా భగవానుడు ఏ రూపము పొందడు ఆయన నిరాకారుడే ఆయన కంటికి కనిపించడు. అనుభవ పూర్వకముగా మాత్రమే గ్రహించుటకు వీలైనవాడు. అట్టి వానిని గురించి పోతనామాత్యుడు లోకంబులు, లోకేశులు, లోకస్థులు దెగినతుదినలోకంబగు పెంజీకటి కవ్వలనేనాకృతి వెలుగువాడని చెప్పినాడు. పరమాత్మ అసలు స్వరూపమది. అన్ని మతములు తమ తమ శక్త్యను సారము ఆ పరమాత్మను గురించి తమ తమ అనుయాయులకుపదేశించ బూనుకున్నవి. యదార్థముగ ఆలోచించిన అన్ని మతములు ఒకే సత్యమును గురించి చెప్పుటకే అన్ని విధముల ప్రయత్నించినవి. ఈ దృష్టితో చూచిన మతకల్లోలములు, మత సంఘర్షణలు మతం పేరిట జరిగే మారణహోమాలు వీటికి తావుండదు.

మానవతా దృక్పథాన్ని మరుగుపరచి. కులం, మతం పేరిట జరుగుచున్న మారణ కాండ అంతం కావాలంటే అసలైన భగవత్తత్వం అందరికీ విదితం కావాలి. నిర్గుణ పరబ్రహ్మ అనుభవమైన మరుక్షణం సూర్యుని వేడికి ఆరిపోయిన కళ్ళాపు నీళ్ళవలె ఈ మతకలహాలు అంతరిస్తాయి. అందులకై ప్రతి యొకరు విచక్షణా జ్ఞానంతో చిద్రూపిణి యైన ఆ పరాశక్తిని శరణు పొందాలి. ఈ విషయాన్నే చిత్రకారుడు దేవి రూపాన్ని చిత్రించేటపుడు ఆ చిత్రం ద్వార ఒక రహస్యమైన తత్వాన్ని చెప్పటానికి ప్రయత్నించాడు. నల్లని శరీరచ్ఛాయ, ఎఱ్ఱని నాలుక, పుఱ్ఱెల హారము, బహు హస్తములు, రక్తపూరిత ఖడ్గం, చూడగానే భయం కలిగించే రూపము, కాళి పేరులో నున్న ఆ దేవి విగ్రహాన్ని చూడగనే గగుర్పాటు, భీతి కలుగుతుంది. కాని భక్తి భావము కలిగే అవకాశమే కన్పించదు. ప్రేమైకమూర్తి, కరుణామయి అయిన అమ్మను ఎందుకు అలా చిత్రించి వుంటారు. ఆమె ప్రేమ స్వరూపిణి కదా. ఆ ప్రేమ వెనుక యింత భయంకరమైన ఉద్భ్రాంతి కలిగించు ఈ ఆకృతి దీనిని గురించి ఆలోచించవలసి యున్నది.

పిల్లలు దాగుడు మూతలాట అని ఆడతారు. అమ్మ పిల్లలందరినీ నిలబెట్టి తన చేతితో ఒకనికి కళ్ళుమూసి మిగిలిన వారిని దాక్కొమ్మని చెప్పి వదలి వేస్తుంది. ఈ పిల్లలు అమ్మను వదలి ఆట ఆడి అలసిపోతారు. ఎప్పుడు అలసిపోయామని వాళ్ళకనిపిస్తుందో అప్పుడు అమ్మను పట్టుకుంటేసరి (తల్లిని

ముట్టుకొనుట) వారికి విశ్రాంతి దొరుకుతుంది. అమ్మే మనలను ఆటకు ప్రేరేపించింది. అమ్మను పట్టుకోగానే ఆట పూర్తి అయింది. అమ్మతో కలసి వున్నంతసేపు మనకు ఆట లేదు. తిరిగి అమ్మను చేరిన తరువాత ఆటలేదు. మధ్యకాలంలోనిదే ఈ ఆట. ఒక బాలుడు తల్లిచేయి పట్టుకొని తిరుణాలకు వెళ్ళాడు. అక్కడ రంగురంగుల బెలూన్లు వ్రేలాడగట్టబడి బాలుని దృష్టినాకర్షించాయి. తల్లి చేయి వదలి వాడు వాటి వెంట పరుగెత్తాడు. తల్లి చేతిని ఎప్పుడు వదిలాడో ఆ క్షణమే తల్లి కనుమరుగైంది. ఆ భావన కలుగగానే వాడికి దుఃఖము ముంచుకువచ్చింది. ఏ గాజు బొమ్మలు, రబ్బరు బెలూన్లు తన నాకర్షించి ఆనందాన్నిస్తాయనుకొన్నాడో అవి ఆనందాన్నివ్వలేక పోయాయి. అమ్మ సన్నిధిని వదలిన దుఃఖములో బెలూన్ల సౌందర్యాన్ని అతడాస్వాదించలేకపోయాడు ఆ వస్తువులు తనకానందాన్నిస్తాయన్నది భ్రాంతి అని గ్రహించాడు. తిరిగి అమ్మను కలుసుకోవటానికి ప్రయత్నించాడు. ఎప్పుడు అమ్మ దొరికిందో అప్పుడే అతనికి కలిగిన దుఃఖము నశించిది. అమ్మను వదులుట వలన తనకు దుఃఖము కలిగిందని, తిరిగి అమ్మను చేరుకోవటం వలనే ఆనందము కలిగిందని అనుభవపూర్వకంగా గ్రహించిన ఆ బాలుడు అమ్మచేతిని వదలకూడదని నిశ్చయించుకుంటాడు. అట్లే ప్రకృతిమాత చిదేక రసరూపిణి పరమేశ్వరి నిత్య భ్రాంతి కలిగించి సమ్మోహితులనుచేసి విషయాసక్తులైనమనలను తిరిగి తన దగ్గరకు చేర్చుకొనుటకై, కాళీమాతగా అవతరించవలసి వచ్చింది. కుమారుడు తప్పు చేసిన సరిదిద్దుటకు తల్లి కొన్ని

సార్లు కేకలు వేయును. అవసర మనిపించినపుడు అ బిడ్డకు బాధ కలుగకుండ దెబ్బకూడ వేయును. మనలను చక్క దిద్దుటకే ఆ తల్లి ప్రయత్నించును. కాని బీతావహులను చేసి తన నుండి దూరము చేయుటకు కాదు. శ్రీ రామకృష్ణ పరమహంస చెప్పినట్లు పిల్లలు బొమ్మలతో ఆడుకుంటున్నంత సేపు తల్లి తన పనులనుతాను చేసుకొంటూ ఉంటుంది. బొమ్మ లను పారవేసి అమ్మ కావాలన్నప్పుడు అమ్మ చేతిలో ఏనివి వదలిపెట్టి అయినా బిడ్డనులాలించదా? విషయాసక్తుడై ధనేషణ దారేషణ, పుత్రేషణ అను ఈ షణత్రయములలో తగుల్కొని వాటి యందానందాన్ని పొందాల ప్రయత్నించి నన్నాళ్ళు తల్లి మౌనముగా నుండును. వాని యందు విసుగు జనించి నిజ సుఖాభిలాషియై తనను శరణు పొందినచో మొదటిగా అతనిలోని అంతర్బహి శత్రుసంహారము చేయుటకు అ తల్లి కాళీ రూపము నెత్తును.

ఈ సృష్టిలో మనం ఎంతమందినో చూస్తున్నాము. ఎవరినైన సుఖంగా ఉన్నారా? అని అడిగితే వారు బాధలను, దుఃఖాలను ఏకరువు పెట్టటం ప్రారంభిస్తారు. ప్రపంచములో నిజంగా సుఖంగా ఉన్న మానవుడు కనిపించుటం లేదు. అందరూ ఏదో ఒక దుఃఖముతో, ఒక కొరతతో, ఒక ఆవేదనతో దుర్భరంగా కాలం గడుపుతున్నారే తప్ప, గుండె మీద చేయి వేసుకొని, నాకు బాధలు లేవు, నేను ఆనందముగా ఉన్నానని చెప్పగలవాడు ఒక్కడు కూడా లేడు కదా! కొందరికి అధిక

సంతతి వలన బాధ, కొందరికి సంతానములేక బాధ, కొందరికి చదువురాక బాధ, మరి కొందరికి ఉద్యోగాలు లేక బాధ, కొందరికిధనములేక బాధ, యింకా కొందరికి ధన రక్షణయేలేక బాధ, ఉన్న వానికి అరగని బాధ, లేనివానికి ఆకలి అప్పుల బాధ. ఇట్లు చూచిన ప్రపంచమంతయు బాధమయముగా గోచరించును. ఈ అన్ని బాధలకు మూలకారణము తిరుణాలలో బెలూన్లయందాసక్తుడై అమ్మ చేతిని బాలుడు వదలినట్లు విషయాసక్తుడైన మానవుడు చిద్రూపిణి యైన పరమేశ్వరిని విస్మరించుటయే. అమ్మ శరణు పొందిన ఈ బాధల నుండి శాశ్వత విముక్తి లభించగలదు. ఈ బాధలెపుడు మనలను బాధించ లేవు. ఆ విషయమును గ్రహించ లేక పోవుటయే మానవుని దుఃఖమునకు కారణము. ఒకడు పాలముదున్నుచు పెసర చేలో ఉంగరము పోగొట్టుకొని అన్నము తినుచు ఆ చేని పప్పుగదా! ఉంగరము దొరుకునేమోయని వెదికినట్లు (పెసర చేలో ఉంగరము పారేసి పప్పులో వెదికెనని సామెత) చేలో పారవేయబడిన ఉంగరము పప్పులో దొరుకుట ఎట్లు సమంజసమో, అట్లే శాశ్వత సుఖ స్వరూపుడైన తాను సుఖమునెట్లు పోగొట్టుకొనెనో తెలుకొనలేక విషయాలలో సుఖమున్నదనివెదుకుచున్నాడు.

వెనుకటికి ఒక స్త్రీ బట్టలు కుట్టుకొనుచు సూదిని ఇంటిలో పారవేసికొని, ఇంటి దీపము చిన్నదిగా నున్నందున సూది కనబడదని, వీధిలో పెద్ద దీపమున్నది గదా ఆ దీపపు వెలుగులో సూదికనబడక పోవునాయని వీధిలో వెదకుచుండెనట

ఆమె శ్రమంతయు వృథాయగునేకాని ఆమెకు సూధిలభించునా? అట్లే బాహ్య జగత్తులో, బాహ్య విషయములలో సుఖమున్నదని జీవుడారాటపడి నిరంతరము శ్రమ చేయుచున్నాడు. ఒంటరి గానున్న తనకు సుఖములేదని, తనకొక జంజాటము తోడు చేసుకొనును (అనగా పెళ్ళి చేసికొనును). అతని బాధ్యత బరువు నాటి నుండి పెరగుటము ఆరంభించినదే. కాని, తాను కోరుకున్న సుఖము వెంట పరిగెత్తి జీవితములో చరమాంకానికి చేరుకొంటాడు, ఏదో పొందలేక పోయాననే నిస్పృహ, నిరాశ లతో జీవిత చరమాంకము వచ్చేస్తుంది. తనకేమి కావాలో చెప్పలేక ఏడ్చే పసి బాలునికి తనేం పొందాలనుకున్నాడో గ్రహించలేని జీవుడికి ఏమి భేధం? సుఖాన్ని (ఆనందాన్ని) ఎక్కడ విస్మృతి చెందాడో అక్కడికి చేరుకోవటం వలననే ఆనందం లభ్యమౌతుంది. ఒక చోట పోగొట్టుకొని, వేరొక చోట వెదికితే ఏ వస్తువైనా ఎలా దొరుకుతుంది. కనీసం తాను పోగొట్టుకొన్నానని, దానిని సంపాదించుకోవాలని జ్ఞాన మైనా కలిగితే తల్లి దానినాతని కందించటానికి ప్రయత్నిస్తుంది. అడగనిదే అమ్మైనా పెట్టదన్న సామెత మనకు తెలిసినదే కదా. ఆకలి అయినదని అడిగిన బిడ్డకు మాత్రమే అమ్మ అన్నం పెట్టటానికి ప్రయత్నించును. వ్యాధిగ్రస్తుడై అకలి లేదన్న బిడ్డకు పెట్టిన అన్నం విషమయ్యే ప్రమాదముంది. సంసార వ్యాధ పీడితుడై ఆనందం కావాలని కూడ గ్రహించలేని వానికి నిజానందాన్ని అమ్మ చెప్పదు. ఏలయన సలిలము శుద్ధమయ్యు శ్రవణ స్థితంబైన శూల పుట్టించునట్లు సంసార వ్యాధి పీడితు

నకు (భవరోగికి) బాధాకరమగునే కాని ఆనందకరముకాదు
మందు పేరు చెప్పినంత మాత్రమున రోగ నివారణ కాద
కదా అన్నమన్నమని అరచినంత మాత్రమున ఆకలి
తీరదు కదా. బలవంతముగానైన ఆ మందును మ్రింగిన
రోగ నివారణ యగును. ఎట్లైయిన ఆ అన్నము సంపాదించు
కొని తిన్న ఆ అకలి తీరును. అసలు తనకు జబ్బేలేదన
వానికి మందును ఆకలే లేదను వానికి అన్నమును అవసరము
లేదు. సంసారములో ఏ సుఖము లేదని, సుఖము త
యందే కలదని గురువాక్యముపై, శాస్త్ర ప్రమాణముపై
నమ్మకము గల వానికి మాత్రమే ఈ విషయము తెలియజేయ
వలసి యున్నది, అట్టివానికిది సులభ గ్రాహ్యమగును. లేనిచ
కడు జటిలమై చెప్పెటి వానికి, వినెడు వానికి అర్థము కాని
వేదాంతయను వెఱ్ఱి నానుడికి లోను గావలసి వచ్చును.

కాళీమాత భయంకర రూపము వెనుక దాగిన రహస్యము
మనమిప్పుడు పరిశీలిద్దాము. ప్రపంచములో ఇవుడనేకవ్యాధుల
ప్రబలియున్నవి. ఈ వ్యాధుల నిర్మూలనానికి అనేకమైన
మందులు కనుగొనబడ్డాయి. ఆ మందులను తగుమోతాదుల
వాడినపుడు వ్యాధి క్రిములను నిర్మూలించి దేహాన్ని బాగు
చేయును. అదే మోతాదు మించినపుడు కొంతకాలము సంఘ
లోకి పంపగలదు. అదే గుప్పెడు మాత్రలు మ్రింగినచ
శాశ్వత నిద్రగూడ కలిగించగలదు. 'అనెస్తీషియా' అపరేష
సమయంలో రోగిని కదలనీయకుండా చేయుటానికి ఉపయో

పడుచు వైద్యానకు సహాయకారి అవుతుంది. అదే ఎక్కువగా యిచ్చినపుడు ప్రాణహాని కలిగించటానికి వెనుదీయదు. దీనిని బట్టి తెలిసదేమంటే క్రిమి సంహారకములైన మైసిన్, పెనిసిలిన్ మున్నగు మందులన్నియు హానికరములే. ఆ హానికరములైన వానిని శాస్త్రజ్ఞులు ఎందుకు కనిపెట్టారు? ఒక హానికరమైన దాని వెనుక ఒక నిర్మాణము దాగియున్నది. ఆ దృష్టిలోనే ప్రమాదము కలిగించు ఈ మందులు కూడా కనుగొనబడినవి. అట్లే సంసార భ్రాంతి, విశ్వ భ్రాంతి, విశ్వమోహము మనకు కలగటానికి కారణమైన అవిద్య (అజ్ఞానము) ఆవరణ (ఉన్నది కనిపించకుండా చేసిన ముసుగు) విక్షేపము (లేనిది ఉన్నట్లుగా కనిపించిడం) లను తొలగించుటకు జ్ఞానము ప్రసాదించుటకు తల్లి కాళీమాతగా అవతరించవలసి వచ్చింది. మనస్సు జీవుడినివశం చేసుకొని అరిషడ్వర్గాలు విషయ వాసనలు అతనిని బానిసగా చేసి వీర విహారం చేస్తున్నప్పుడు సిగ్గులేనివాడై వాని అధీనములోబడి వేశ్య వెంట దిరుగు వెఱ్ఱివానికి దాసోహమనుచున్నాడు. అందుచె అతనిని భండాసురుడు అన వచ్చును. భండ అనగా లజ్జలేని వాడని అర్థము. అసురీ ప్రవృత్తినాశ్రయించినందున అసురుడయ్యేనని వానిని వధించుటకు ఆ తల్లి కాళీ రూపమెత్తవలసి వచ్చినది. భండాసురవధో ద్యుక్తా శక్తి సేనాసమన్వితా (లలితాసహస్ర నామ స్తోత్రములలో 24) అని పరమేశ్వరికి మరొక నామము సచ్చిదానంద రూపుడైన తాను జీవ భావం పొంది లజ్జితుడై కించిజ్ఞుడైనాడు, అజ్ఞానియై సుఖదుఃఖాలచే పీడింపబడు వాని అసూన్ ప్రాణములను,

రణ తొలగించునది అని దీని అర్ధము. జీవత్వానికి, సంకుచితత్వానికి, రాగ ద్వేషాలకు, కామక్రోధాదులకు, లోభమోహాలకు అవిద్యే కారణము. అది తొలగితే మానవుడు మాధవుడే. వ్యష్టి భావము నుండి సమిష్టి భావనకు వెళ్ళగలిగితే, సంకుచిత భావము నుండి పూర్తి భావమునకు వెళ్ళగలిగితే అవిద్య తొలగినట్లే. ఎప్పుడైనా ఏవరిలోనైనా మాట్లాడుతున్నపుడు, నేను బ్రాహ్మణుడను, నేను క్షత్రియుడను, అని నీ కులము గుర్తు వస్తే, నేను డిగ్రీలు పొందాను, నేను I.A.S. ఆఫీసరునని, మంత్రినని, పోలీసధికారినని, గుమాస్తానని, మేనేజరునని నీ హోదా గుర్తువస్తే నీలో అవిద్య ఉందని గ్రహించు. నీ ధనం, నీ పలుకుబడి, నీ సౌందర్యము, సౌశీల్యము, సౌకుమార్యము మొదలగునవి గుర్తుకువస్తే, నీగుణాల్లో ఏఒకటిగుర్తు వచ్చినా నీలో అవిద్య యింకా ఉన్నదని గుర్తించాలి. 'బ్రహ్మైవాహం'నేనే బ్రహ్మనుత్వమేవ ప్రత్యక్షం బ్రహ్మ 'నీవేప్రత్యక్షమైన ఆత్మ స్వరూపుడవని వేదం ఘోషిస్తుంటే నేను దేహాన్ని, నేను జీవుణ్ణి అనటం, అవిద్యకాదా? అట్టి అవిద్యను తన చేతిలోని ఖడ్గంతో ఛేధించి బ్రహ్మైవాహం అన్న వేదసూక్తిని అమ్మ నిజం చేస్తుంది. ఈ అర్ధాన్ని సూచించటానికి గాను పెద్దలు భండాసురుడనే రాక్షసుడు కలడని వానిని దేవి తన ఖడ్గంతో సంహరించినదని, ఆ శుభసూచకంగా మనం పండుగ చేసుకుంటున్నామని చెప్పారు. మనలో జీవభావము భండాసురుడు నశించనంతవరకు మన మీ నవరాత్రులు చేసినా చేయనట్లె. జీవ భావం నశించి దనటానికి పరీక్షాధికారులెవరూ

ఉండరు. నీకు నీవే విమర్శించుకొని అట్టి జీవ భావమైన జాతి హెూదా, కులం, మతం, ధనం గుర్తుకు వస్తే, అవిద్య మనలో కలదని గుర్తించి దాన్ని రూపుమాపటానికి కాళీమాత రూపాన్ని ఆరాధించాలి. నీపై ఆఫీసరుతో మాట్లాడేటపుడు అతడు చెప్పేది తప్పని నీకు తెలిసి కూడా ఆ విషయం బయటపడ నీయక 'అవునండీ' అని నీమనస్సును చంపుకొని ఆ అధికారిని నమ్మిస్తూ ఉంటే అపుడు నీలో అవిద్య ఉందని గ్రహించు ఆ అవిద్యయే ఆ అధికారి నెదిరించినచో నీకు జరగబోవు పరిణామాన్ని సూచించి భయపెట్టును, అవిద్య కారణమైతే దాని కార్యం భయమౌతుంది, అట్లని నీవు సర్వజ్ఞుడననుకొని అందరినీ ఎదిరించ బూనరాదు. అట్లెదిరించినచో అది అంహకారమగును. నీకు తెలిసిన సత్యాన్ని అనునయించి తెలియచేయుటానికి ప్రయత్నము చేయుము లేదా ఉదాసీనంగా ఊరకొండుము. అంతేకాని తప్పని తెలిసిన తరువాత దానిని సమర్థించరాదు. మనలోనున్న ఈ అవిద్యను రూపుమాపుటకు తల్లి కాళీమాతగా అవతరించిది. ఈ మాయాశక్తిని అన్ని మతములవారు ఏదోఒక రూపంగా అంగీకరిస్తునే ఉన్నారు. (క్రైస్తవులు సైతాన్ అని, బౌద్ధులు మరా అని, వేదాంతులు అనాత్మ అని, బోరాష్ట్రియనులు అరిమాన్ అని అంటారు.) దయ్యం అనేది పరమాత్మ శక్తిని తెలుసుకోవటానికి వీలు లేకుండా భ్రాంతి కలిగించేది. ఈ మాయాశక్తియే గారడీ వాడు గారడీచేసి ఆతని కంటే దూరంగా ఉన్న మనలను సమ్మోహితుల్ని చేసి, దగ్గరకుపోగానే ఆ మాయను తొలగించి

యదార్థ వస్తు తత్వాన్ని మనకు తెలియచేసినట్లే, సమ్మోహన రూపిణియైన తల్లి కాళీ రూపమై పరమాత్మ శక్తి తెలియనీయక ఉన్న భ్రాంతిని నాశనం చేస్తుంది. దొరగారి బిడ్డడైనను తొడ పాశము పెట్టి బుగ్గలు గిల్లందే బుద్ధిరాదు, అవసరమైనపుడు తల్లి అయినా శిక్షించవలసి వస్తుంది. అయితే తల్లి శిక్షకు వెనుక ద్వేషభావముండదు. తల్లి కొట్టే దెబ్బలు ప్రేమ పూరితమైనవే వానికి కీడు జరగవలెనను సంకల్పము తల్లి కుండదు. కుమ్మరి కుండను తయారు చేయునపుడు దాని ఆకారము సరిగా రాగలందులకు ఒక చెక్కను పెట్టుకొని, దానితో కొట్టుచు సరిచేయును. దానిని చక్క చేయుటకు మాత్రమే కొట్టును. కాని ఆ కుండ పగిలి పోవలెనను దృష్టి అతని కుండదు. అలాగే చిద్రూపిణి యెన పరమేశ్వరి భయానక రూపమైన కాళీ రూపం ధరించింది.

ప్రతి వ్యక్తి ముందుగా నేనెవరు? ఎక్కడ నుండి వచ్చాను? ఎక్కడకు వెళతాను? అను మూడు ప్రశ్నలకు సమాధానం తెలుసుకోవాలి. ఆ ప్రశ్నల కెవరు జవాబు తెలుసుకుంటారో వారు, తిరిగి పుట్టరని, వానికి సమాధానము తెలిసిననాడు తన యింట్లో తనతో పాటు సర్వసౌఖ్యాలు తాను భవిస్తు తనవలెనే కావచ్చుని గీతలో పరమాత్మ సెలవిచ్చినాడు. గీతలో పరమాత్మ తన అడ్రస్ చెప్తూ "నతద్భాసయతే సూర్యో నశశాంకో, నపావకః, యద్గత్వాననివర్తంతే తద్ధామ పరమం మమ" అని అన్నారు (15-6 గీ) మన మెక్కడకైనా వెళు

తుంటే ఎవరైనా తమ విజిటింగ్ కార్డు మనకిచ్చారంటే, యిపుడు కాకపోయినా ఏపుడైనా అవసరమనిపిస్తే ఫలానాచోట మా యిల్లు ఉంటుంది రండి అని అర్థం కదా. పరమాత్మ కూడా అలాగే తన అడ్రస్ ఉన్న కార్డు మనకిచ్చి జేబులో పెట్టుకోమన్నారు. ఈ సంసారం బాధాకరమని, దుఃఖమయమని అనిపించినపుడు మా యింటికి రండి, మా యింట సూర్యచంద్రులు ప్రకాశించరు, అగ్ని అసలే మండదు. అక్కడికి వచ్చిన వారు తిరిగి వెళ్ళరు. అని చెప్పాము కదా! అలా అంటే ఆయన యిల్లు చీకటి కొంపా? అగ్ని మండకపోతే తినే పదార్థాలు ఉండవా? అట్లాఏమిలేని యింటికి వెళ్ళినవాళ్ళు తిరిగి రాక అక్కడే ఎలాఉండగలరు, అని మనకు సందేహము రావచ్చు. అనుభవజ్ఞులు అక్కడ సూర్య, చంద్ర ప్రకాశము సూర్యుని ముందు దివిటి వలె నిష్ప్రయోజనమని అగ్ని ప్రకాశము వెలవెల బోవునని, ఆకలి-దప్పులు, చావు-పుట్టుకలు సంకల్ప-వికల్పాలు, అహంకార-మమకారములు, సుఖ-దుఃఖములు మున్నగు దేహ ధర్మములను వదలిన వాడే అక్కడకు చేరగలుగునని వానికి వీటి అవసరముండదని ఆనంద స్వరూపునిగా సద్ఘన, చిద్ఘన. ఆనందఘనుడుగా తానుండునని చెప్పిరి. అట్టి వానికి వాసనలుండవని వారు తిరిగి జన్మకు రారని దాని అర్థము.

మనకు బాహ్యేంద్రియములని, అంతరింద్రియములని రెండు విధములగు ఇంద్రియములున్నవి. వానిలో జ్ఞానేంద్రియ

పంచకమని, కర్మేంద్రియ పంచకము రెండు విధములు ఈ బాహ్య జ్ఞానేంద్రియములు, అంతర జ్ఞానేంద్రియములను గోళములలో బంధింపబడి సదా బహిర్ముఖమై బాహ్య విషయాల గ్రహించటానికి ప్రయత్నిసుంటాయి, కన్ను చూచె పని యందు, చెవి వినే పని యందు, ముక్కు వాసన చూనె పని యందు, నాలుక రుచి చూచే పని యందు, చర్మము స్పృశించుట యందు నిమగ్నమై యుండుట వలన వీటికి అంతర్ముఖ దృష్టిలేదు. సూర్య కిరణాలు, ప్రకాశమానమైనవే. వానిలో ఉష్ణమున్నను అసివంటరిగా (ఒక్కొక్కటి) దేని కాల్చలేవు. భూతద్దము ద్వారా ఆ కిరణములనే కేంద్రీకరింప జేస్తె దేనినైనా కాల్చటానికి అవి ఉపయోగపడతాయి అలాగే బహిర్ముఖమైన ఇంద్రియాలను అంతర్ముఖంచేస్తే కేంద్రీకృతమైన ఈ ఇంద్రియ శక్తియే అవిద్యానాశానానికి తోడ్పడుతుంది.

పరమాత్మ సర్వశక్తిమంతుడు. అష్టవిద ప్రకృతులు క్రమముంగా నశించేవే. పరమాత్మ మాత్రము నశించని వాడు ఈ విషయాన్ని మనమిలా తెలుసుకోవచ్చు. మనం నేర్చుకున్న ఎక్కాల్లో ఎనుమిదవ ఎక్కము అష్టవిద ప్రకృతులను సూచిస్తుంది. అది రెట్టింపు అయ్యే కొలది దాని విలువ తగ్గడం మనం గమనిస్తున్నాము. $8 \times 2 = 16$ అనగా $1 + 6 = 7$ అయింది. 8 రెండు రెట్లు కాగాలే దాని విలువి 7 గా తగ్గింది $8 \times 3 = 24$ ఇందు $2 + 4 = 6$, 8 వ అంకె మూడు రెట్లు

కాగానే దాని విలువ '6' గా తగ్గినట్లు మనం గమనిస్తున్నాము. ఇలా క్రమంగా సంఖ్య రెట్లు పెరిగే కొలది విలువ తగ్గుతూ వస్తుంది. దానికే పూర్ణ సంఖ్య అయిన పరమాత్మ తత్వాన్ని చేకుస్తే $8+1=9$, ఇది ఎన్నిసార్లు హెచ్చించినా దాని విలువ మారదు. $9\times2=18$, $1+8=9$, $9\times3=27$, $2+7=9$, $9\times4=36$, $3+6=9$, $9\times5=45$, $4+5=9$ ఇలా ఎన్నిసార్లు హెచ్చించిననూ విలువ మారక నశించక ఉండువాడు పరమాత్మ అష్టవిద ప్రకృతలకు చేరిస్తె అది తొమ్మిది పరమాత్మ సంఖ్య అవుతుంది. గీతలో 13 వ అధ్యాయంలో:

ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవచ
ఏతద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయశ్చ కేశవ

అర్జునుడు క్షేత్రమననేమి? క్షేత్రజ్ఞుడననెవరు. ఎవరిని తె సుకొన్న జ్ఞేయము తెలియును. దానిని తెలియగోరు చున్నానను. అనగా అష్టవిధ ప్రకృతులను, అందు క్షిప్త మైన ఆ పరమాత్మ తత్వాన్ని తెలియజేయమని అడిగాడు

"క్షేత్ర క్షేత్రజ్ఞయోర్జనం యత్తత్ జ్ఞానం మతంమమ"
(గీ॥ 13-2)

క్షేత్రమును, తద్వార క్షేత్రజ్ఞని తెలుసుకొనే ఏ జ్ఞానమైతే కలదో అది తన మతమని గీతాచార్యుని సమాధానము. మన దేహము అష్టవిధ ప్రకృతులతో నిర్మాణమైనది. ఇవి క్రమ

క్రమంగా క్షీణిస్తువస్తాయి. కాని దీని కధిష్ఠానంగా ఉన్న పరమాత్మ తత్వము క్షీణించదు.

భూమి రాపోఽనలో వాయుః ఖం మనోబుద్ధి రేవచ
అహంకార మితీయం మే భిన్నా ప్రకృతి రష్టధా
(గీ॥ 7-4)

తన ప్రకృతి ఎనిమిది విధాలని ఆ ప్రకృతి నుండి మన సకల ఇంద్రియాలు, దేహం నిర్మాణమైనవని వానిని అంతర్ముఖం చెస్తే దాని నెఱిగెడి క్షేత్రజ్ఞుడనే వానిని తెలుసుకోవచ్చని అలా క్షేత్రము ద్వారా (అనగా అంతర్ముఖమైన మనస్సు ద్వార) అనుభవ పూర్వకంగా ఎవడు దీనిని తెలుసుకుంటాడో వాడు నా మతము నెఱిగిన వాడని, అదే తన మతమని గీతాచార్యుల బోధ. కాని మానవ జన్మ ఉత్తమత్వానే గ్రహించలేక నేడు మానవుడు అష్టవిధ ప్రకృతులతో గూడిన ఈ దేహాన్నే సత్యమని, స్థిరమవి నమ్మి ఆ పరమాత్మకు దూరమవుచున్నాడు అలా నశించే దేహాన్ని శాశ్వతమని నమ్మించేదే అవిద్య.

అవిద్యను నాశనం చేయాలంటే అవిద్య ఎక్కడ నుండి వచ్చింది. దాని రూపం ఏమిటి అని ఆలోచిస్తుంటే అది నాశనంకాదు. చీకటి గుహలోనికి వెళ్ళి ఈ చీకటి గుహలో ఎన్ని సంవత్సరాల నుండివుంది. అనిఆలోచిస్తేచీకటిపోతుందా? ధైర్యం చేసి ఒకదీపం వెలిగిస్తే చీకటి మాయమౌతుంది. చీకటి పుట్టు పూర్వోత్తరాలు గురించియోచిస్తుకూర్చుంటేచీకటిఎలాపోదో అలాగే

అవిద్యా నాశనాన్ని గురించి యోచిస్తే అవిద్య తొలగదు. అసలు చీకటి, వెలుగు అనే రెండు పదార్థాలు లేవు. ఉన్నది ఒక్కటే ఏదైనా అడ్డం పెట్టటము వలన ఆ ఉన్న వెలుగే చీకటి అవుతుంది. దీపం వెలిగించటం వలన చీకటి ఎక్కడికో పోయి దాని స్థానాన్ని వెలుగు ఆక్రమించటము లేదు. ఆ చీకటియే ఇప్పుడు వెలుగైనది. అలాగే మనము కూడా అష్ట విధ ప్రకృతులతో కూడిన దేహాన్ని 'నేను' అనే భావన అడ్డు వేసుకొనుట వలన (అహంకార భావన అడ్డుపడుట వలన) ఉన్న దున్నట్లుగా పరమాత్మ కనిపించక లేనిది ఉన్నట్లుగా కనిపిస్తున్నది. సచ్చిదానందరూపమైన ఆత్మగోచరించక లేని జగత్తు గోచరించుచున్నది. ఆ అహంకారము తొలగితే పరమాత్మ ఉన్నట్లు ఆ పరబ్రహ్మమే తానయినట్లు అనుభూతి కలుగుతుంది. ఈ అనుభూతి సద్గురువు లభించిన వాడికి చాలా తేలిక గీతాచార్యుడందుకే గీతలో అర్జునునితో 'సుసుఖం కర్తు మవ్యయమ్' అన్నాడు. (చాలా తేలిక)

పరమేశ్వరి కాళీ రూపంలో అవతరించుటము కేవలము అవిద్య నాశనానికే. అలా ఎందుకామె చేసిందో ఆలోచిద్దాం. అమ్మ అపరిమితంగా మన కివ్వటానికి కొన్ని పరిమితమైన వాటిని మన నుంచి తీసుకుంటిది. పెద్దలెవరైన చిన్న పిల్లలను ఆ చేతిలో బిస్కెట్ ముక్క పెట్టవా అని అడుగుతారు. వారికా బిస్కెట్ తినాలని కోరిక కాదు. ఆ పిల్లవానికి పెట్టె బుద్ధి ఉందా, లేదా తెలుసుకోవటం కోసమలా అడుగుతారు. వాడు చిన్న ముక్క పెడితే తన చేతిలో నున్న పెద్ద పాకెట్ నే

వాడికిస్తారు. అలాగే అమ్మ అపరిమితమైన వస్తువు నివ్వటానికై పరిమితమైనవి మన నుంచి తీసుకుంటుంది. చిన్న వస్తువును నాశనం చేసి ఒక పెద్ద వస్తు నిర్మాణానికి తోడ్పడుతుంది. నిర్మాణ క్రియలో నాశన క్రియ ఒక భాగం (విచ్చిన క్రియ) మన జీవితం నాశనంలోనే యిమిడి ఉన్నది. మనము అన్న గత ప్రాణులము. ఆ అన్నము తయారయ్యే విధానాన్ని ఒక సారి పరిశీలిద్దాము. రైతు ముందుగా పొలాన్ని దున్నుతాడు. గడ్డలను విరుస్తాడు. భూమి పార పగిలి భూమి స్వరూప నాశనం చెందింపి. తరువాత దానిలో విత్తనం వేయిబడుతుంది మొక్క కావాలంటే విత్తనం నాశనం కావాలి. వడ్లగింజ దంచబడి తన రూపాన్ని కోల్పోతేనే బియ్యం వస్తుంది. బియ్యం తన రూపం కోల్పోతేనే అన్నం అవుతుంది. చెట్టు నాశనమై కట్టె రూపం పొంది కట్టెలు కాలి వేడినిస్తేనే అన్నం ఉడుకుతుంది. తిన్న ఆహారంకూడా శక్తిగా మారాలంటే అన్నం నాశనం కావాలి. అన్నం తనరూపాన్ని కోల్పోతేనే శక్తి ఉత్పత్తి అవుతుంది.

మనం కూడా పశుత్వాన్ని నాశనం చేసుకుంటే మానవ త్వాన్ని పొందుతాము. మానవత్వాన్ని పొందటం కోసం పశు త్వాన్ని పణంగా పెట్టాలి. మాధవత్వాన్ని పొందటం కోసం మానవత్వం కూడా వదలాలి. బ్రహ్మత్వాన్ని పొందాలంటే మాధవత్వాం కూడా పోవాలి. ఇలా క్రమంగా ఒకదాన్ని పోగొట్టుకొని మరొదా పొందుతూ తుదకు ఎన్నటికీ పోనట్టి దాన్ని పొందాలి. అంతేకాని పాశవిక గుణాలతో నున్న

మానవుడు 'అహం బ్రహ్మాస్మి' అని ఒక్కసారిగా బ్రహ్మమై పోవాలంటే సాధ్యంకాదు. దుర్గమ మైన అవిద్య నుండి మనలను కాపాడి ముక్తిప్రదాయిని అగుట వలననే అమ్మకు 'దుర్గ' అని పేరు వచ్చెనట.

జనభా పెరుగుదల నేడొక తీర్చలేని సమస్య. మన దేశంలో ఆర్థిక శాస్త్రవేత్తలు, మేధావులు ఎంత ప్రయత్నించిన దీని నరికట్ట లేక పోవుచున్నారు. పిల్లవాడు ఏదైనా పనిచేయ లేనపుడు అది వాని చెతకాదని తెలిసినపుడు తల్లి దానిని తన చేతిలోనికి తీసుకొని పరిష్కరించ బూనుకుంటుంది. అలాగే దేశంలో ఆహార ధాన్యాలు కరువై జనాభా మితిమీరి పోయి నపుడు అమ్మ భూకంపమో, వరదలో, అంటువ్యాదులో, క్షామమో, యుద్ధమో, ప్రమాదమో సృష్టించి ఆ జనాభా సమస్యను పరిష్కారం చేస్తుంది.

యదా యదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్యత దాత్మనం సృజామ్యహం

(గీత 4-7)

అని గీతాచార్యుడు చెప్పినట్లు అధర్మ వృద్ధి ధర్మహాని జరిగినపుడు అక్కడికక్కడే ఉత్పాతాలు సృష్టించి ఆ సమస్యను పరిష్కరిస్తుంది. తల్లి యిలా భూకంపాలు, వరదలు సృష్టించి జన నష్టాన్ని చేయటాన్ని మనమెలా సమర్థి

స్తాం. అనుకుంటారేమో! పరిశీలిస్తె అత్యంత నిర్మాణాత్మక విధానం కొన్ని నాశనకర విధానాల పరిణామమే. ఒక వంతెన నిర్మించాలంటే కార్మికశక్తి అనేకంగా నశించాలి. ఎంతో మంది శ్రమించి తమ శక్తి ధారపోస్తేనే ఒక వంతెన నిర్మాణం జరుగుతుంది. తాజ్‌మహల్ వంటి అందమైన భవననిర్మాణము వెనుక ఎంత శ్రామిక శక్తి నాశనం కాబడిందో ఊహించు కుంటే తెలుస్తుంది. శాస్త్రజ్ఞులు అణుశక్తి, అనేక విధము లగు శాస్త్ర పరికరములను, సిద్ధాంతాలను, తమ మేదాశక్తి ధారపోసి కనుక్కున్నారు. ఈనాడు గ్యాస్ మీద వంట చేసు కోవటము. ఎన్నివేలమైళ్ళ దూరానైనా త్రుటిలో ప్రయాణం చేసి రాగలగడం, దూరంగా న్న మన వాళ్ళలో మాట్లాడటం, ఎక్కడో పాడుతున్న పాటలను వినటం, చనిపోయిన వాళ్ళ గొంతును (వీడియో రికార్డు ద్వార) వినగలగడం, వారిని చూడగలగడం, మొదలగు పరిశోధనల వెనుక ఎంత మేధా శక్తి ఎంత పరిశోధనాశక్తి ఉపయోగించబడినదో (ఖర్చైయినదో) ఊహించవచ్చు. తల్లి తన సంతానాన్ని కబళించటం, దాన్ని మీరు సమర్ధించటం సవ్యంగా లేదని ఎవరికైనా అనిపించ వచ్చు. సాధారణ మానవ దృష్టితో ఆలోచిస్తె వరదలు, భూకంపాలు ఇత్యాదుల వలన జన నష్టము అవుతున్నది. అన్నది సత్యమే కాని విజ్ఞాన శాస్త్ర దృష్ట్యా యోచిస్తె ఇందలి సత్యం మనకు గోచరిసుంది.

Matter can neither be created not destroyed by any known Physical or Chemical change"

అన్న భౌతిక శాస్త్ర దృష్ట్యా యోచిస్తే పదార్థతం సృష్టింప బడదు. నాశనం కాదు. భౌతిక రసాయనిక మార్పులు మాత్రమే చెందుతుంది, ఒక స్వరూపంలో నాశనం వేరొక స్వరూపంలో వ్యక్తం. ఇదే ఆ జగన్మాతనర్థం చేసుకోవటానికి ఆదారం, చెట్టు చెట్టుగా నాశనమై కలప అయింది. కలపగా నాశనమై కుర్చీగా, బెంచీగా, అకారం ధరించింది. కుర్చీగా నాశనమై వంట చెరకయింది. వంట చెరకుగా నాశనమై బూడిదౌతుంది. మనం నాశన మంటున్న శాస్త్రం, దీనిని పరిణామమే అంటుంది. వరదలు, భూకంపాల్లో జగన్మాత నాశనం చేసిన వాళ్ళు ఎక్కడికో పోవటం లేదు తిరిగి ఇక్కడ మరొకరూపం ధరించి జన్మిస్తు ఉన్నారు.

మనం కూడా ఆ కాళీమాత అనుగ్రహంతో సూక్ష్మాన్ని గ్రహించటం కోసం స్థూలమైన మన అవిద్యను నాశనం చేసు కోవాలి. వెలుగు కావాలంటే చీకటి నాశనాన్ని మనం అంగీకరించవలసినదే కదా! చీకటి నలాగే ఉంచుకుంటాను. వెలుగుకూడా రావాలి అంటే ఒక వరలో రెండు కత్తులు యిముడ లేనట్లు చీకటివెలుగులు రెండుండడానికి వీలులేదు. చీకటి నాశనమైతేనే వెలుగు ఆ చోటు నాక్రమిస్తుంది. లోపాలు నాశనమైతేనే పరిపూర్ణత ఆ చోటు నాక్రమిస్తుంది. సంకు చితత్వము నాశనమైతేనే హృదయ వైశాల్యం పెరుగుతుంది. అపవిత్రత నాశనమైతేనే పవిత్రత చేకూరుతుంది. క్రింది మెట్టు వదలితేనే పైమెట్టు నధిరోహించగలుగుతాము. నీచ

స్థాయిని వదలనంత వరకు ఉచ్ఛస్థితి లభించదు. అలా ఒక దాన్ని వదలి వేరొకదాన్ని స్వీకరించుటయె యోగాభ్యాసము అంటాము. (వేరొకవాయువును తీసుకొనడంకొఱకు యోగులు తమలోని వాయువును పూర్తిగా వదులుతారు.) మానవత్వం నుండి దైవత్వాన్ని పొందాలంటే మనలో తొంగి చూస్తున్న పశుత్వాన్ని నాశనం చెయ్యాలి. అసలు మనలో పశుత్వమే లేదని మనం చాలా మంచి వాళ్ళమని ప్రతి వారికి నమ్మకము. ఎవరికి వారు బయటి వారిలో చెడును గమనించగలరే కాని తనలో నున్న పశుత్వాన్ని తెలుసుకో లేడు. మనం తెలుసు కున్నది చాలా తక్కువని విజ్ఞాన మెంతొ గొప్పదని మనం తెలుసుకొనవలసినది చాలా కలదని తెలుసుకో లేకపోవటమే అజ్ఞానం. ఒకరు నేను M.Sc. బాటాని అండీ అంటారు. అంటే బాటనీ తప్ప మరే సబ్జెక్టు నాకు రాదనే కదా! అతడు ఒప్పుకుంటున్నది నాది లెక్కలు. నాది సోషియాలజి సబ్జెక్టు అన్నపుడు ఆయా విషయాలలో కొంత పరిజ్ఞానమున్న మాట నిజమే కాని మిగిలిన అన్ని విషయాలు నాకు తెలియవని. అంగీకరించుటయే కదా. అలాగే మనలో గూడా పశుత్వం ఉందనీ మనకు తెలియదు. కొంత సూక్ష్మదృష్టితో ఆలోచించి నప్పుడు మనలో దాగియున్న పశుత్వాన్ని మనం గ్రహించవచ్చు లేదా సద్గురు సాన్నిధ్యాన శ్రవణం చేస్తే మన పాశవిక గుణాలు మనం తెలుసుకోవచ్చు. ఆత్మ పరిశీలన పశుత్వాన్ని అర్థం చేసువటానికి బాగా ఉపయోగపడ తుంది.

భౌతిక రసాయనక శాస్త్ర ఆధారంగా, ఎలక్ట్రాన్లు, ప్రోటాన్లు, న్యూట్రాన్లు ప్రతి అణువులోను కలవని వాని పరస్పర ఆకర్షణ వికర్షణాది శక్తుల ప్రాబల్యం వల్ల నక్షత్రాల కోవలు (Nebala and Gelaxies)గా ఏర్పడతాయని వాటిలో సూర్యమండలము తద్వార సౌర కుటుంబము భూమి ఏర్పడ్డా యని ఆ భూమి మూలకాల అణువుల మధ్య భౌతిక రసాయ నిక ప్రతి క్రియ లేర్పడి జీవ పదార్థం తయారయిందని తెలుస్తు న్నది. డార్విన్ సిద్ధాంతము ననుసరించి క్రిమి నుండి మానవుడు పరిణామం చెందాడని అదే దశావతారాల కర్థమని మనం అర్థం చేసుకోవాలి. మన శాస్త్రం మత్స్యకూర్మ, వరాహ నారసింహ, వామన, రామ, పరుశురామ కృష్ణాది అవతారము లను భగవంతుడు ధర్మరక్షణకై ఎత్తాడని చెప్తుంది. ఇది డార్విన్ సిద్ధాంతానికి వ్యతిరేకము కాదు. ముందు చేప తర్వాత తాబేలు పిదప పంది ఆ వెనుక సగము నరుడు, సగము మృగమైన రూపము (నరసింహావతారము) పిదప అల్ప జీవ రూపము (వామన) జీవ రూపము (రామ) ఈశ్వరత్వము (పరశురామ) పరబ్రహ్మ (కృష్ణ) రూపము ఎత్తినట్లు చెప్తు న్నది. జీవుడు ఖనజ, స్థావర, క్రిమి, కీటక మృగ పశు జన్మల అనంతరం మానవ జన్మ నెత్తాడు. అనేక జన్మల వాసనలు తనలో నిక్షిప్తంగా దాచుకున్నాడు. ఆ సంస్కారములు మానవునిలో నేటికి ప్రస్ఫుటంగా కపిస్తాయి.

మానవుడు ఏదైన దొరికితే దాచిపెట్టకుంటాడు. తను తినటానికి కాక తన భావితరాల వరకు సంపదను కూడా బెడతాడు. తాను తన కొడుకే కాదు. మనుమడుముని మనవని వరకు తన సంతతి యావత్తు సుఖంగా ఉండటానికి తను యిప్పుడు డబ్బు దాస్తాడు. ఎవరైన ఆకలి బాధతో తన ముందుకు వస్తే వాడికి పెట్టకుండా పుట్టబోయే తన మనవడికి బంగారు నగలు చేయించి దాచిపెడతాడు. ఈ దాచుకునే స్వభావం 'చీమ' జన్మనుంచి మనం సంపాదించుకొ ఆ వాసనను మనలొ దాచుకున్నాము. ఏ వస్తువునైనా చూడగానే రేపటి కోసం దాచాలి అన్న భావన కలిగిందంటే ఇది చీమ నుండి వచ్చిన వాసన అ మనం గుర్తించాలి. ఏ కారణం లేకపోయినా యితరులను కరిచే స్వభావం మాటలద్వార ఇతరు లను బాధించె స్వభావము ఎలాగైనా ఇతరుల మనసును క్షోభ పెట్టి వారు బాధ పడుతుంటే సంతోషించే స్వభావం ఒకళ్ళ సంపదను నాశనం చేయటానికి ప్రయత్నించే స్వభావం పచ్చని కాపురాల్లో చిచ్చుపెట్టే వ్యవహారం అమృతమయమైన ఇతరుల మనస్సులలో విషం చిందించే స్వభావము పయోముఖ విష కుంభాలు ఇవన్ని 'తేలు' నుండి 'పాము' జన్మ నుండి మనకు వచ్చిన సంస్కారాలు. అట్టి వ్యక్తులు తారస పడగానే అది వారి దోషము కాదని అనేక జన్మల నుండి సంప్రాప్తమైన వారి వాసనయే ఆ పని చేయిస్తున్నదని మనం తెలుసుకోవాలి. ఏ కారణం లేకుండా ఇతరులను కొట్టటం, తిట్టటం. వాళ్ళ వస్తువులను లాక్కోవటం, గిచ్చటం, రక్కటం ఇలాంటివి

పిల్లలలో మనం ఎక్కువగా చూస్తాము. ఇతరులను రక్కక పోతే వారికి తోచదు. అలాగే ఒక వయస్సులో పిల్లలు అందరినీ కొరుకుతారు (6, 8 నెలల వయస్సులో) ఇది పులి జన్మ నుండి మనకు వచ్చిన సంస్కారము. ఎంత జాలిగా అడిగినా గుండె కరగక పోవటం ఎంత ప్రేమగా అర్థించినా వినక మనస్సు కఠినంగా ఉడటం ఇవన్నీ రాయి జన్మ నుండి మనకు వచ్చిన సంస్కారాలు. కొందరి నోరు మాట్లాడుతుంటే నొసలు వెక్కిరిస్తుంటాయి. బుద్ధి చంచలంగా ఉంటుంది. దేని మీద స్థిరత్వం ఉండదు. చేస్తున్న పనిని వదలిపెట్టి మరొక పనికి వెళ్ళటం, ఈ ఉద్యోగాన్ని వదలి ఆ ఉద్యోగం, దాన్ని వదలి వ్యాపారం, దాన్ని వదలి మరేదో చేయబూనటం అది 'కోతి' జన్మ నుండి వచ్చిన సంస్కారము. ఇక పంది సంస్కారము చూద్దాము. సృష్టిలో జీవులందరు ఆకలి అయిన ప్పుడే ఆహారాన్ని తీసుకుంటారు. ఆహారాన్ని సంపాదించు కోవాలి దాచుకోవాలి అన్న ఆలోచనే వాటికుండదు. మృగ రాజైన సింహం కూడా ఆకలి అయినప్పుడే వేటకు బయలు దేరుతుంది. వేటాడి తింటుంది. సింహము "నిజకరనికర విదారిత హస్తి మస్తమస్తిష్కమునే కోరునని" చిన్నయ సూరి చెప్పిన దానిని ఇక్కడ మనం జ్ఞాపకం చేసుకోవాలి, సింహము ఎట్టి స్థితిలోను ఇతరులు సంపాదించిన ఆహారాన్ని స్వీకరించ టానికి ఇష్టపడదు. స్వార్జితమైన ఆహారమే దానికిష్టము. కాని మానవుడు పరుల భాగ్యాన్ని అపహరించటానికి, పరుల కష్టార్జిత మును తాను భుజించుటకు సంసిద్ధుడవుతున్నాడు. ఎంత

చిత్రము! యోచించి చూచిన ఆకలి కాకపోయినా ఆహారం తీసుకునేది పంది ఒకటే కనిపిస్తున్నది. ఎవరైనా అనవసరంగా తిండి తింటుంటే 'పందిలాతింటున్నావు' అంటం మనం వింటూ ఉంటాము. అవసరం లేకపోయినా తినేది పంది. ఆ సంస్కారమే మనకు వచ్చి రోజుకు ఎన్నిసార్లయినా తింటున్నాం త్రాగుతున్నాం.

ఒకసారి భుజించువాడు 'యోగి' అని రెండు సార్లు భుజించు వాడు 'భోగి' యని, మూడుసార్లు భుజించువాడు 'రోగి' యని ఆయుర్వేద శాస్త్రం చెబుతుంది. ప్రొద్దునే రెండు మూడుసార్లు కాఫీ త్రాగుట, టిఫిన్ చేయుట తిరిగి భోజనము మధ్యలో హార్లిక్స్, బోరన్విటాలు త్రాగుట, తరువాత చిరుతిళ్ళు ఐస్‌క్రీములు, డ్రింకులు సాయంకాలము అల్పాహారము రాత్రి భోజనము అనంతరము పండ్లు రాత్రి నిద్రపాబోయేముందు పాలు మధ్యలో వీలైతే పార్టీలు అందులో బ్రాందీలు, విస్కీలు మున్నగు మత్తు కలిగించే పదార్థాలు త్రాగటం నానా విధము లైన వానిని తినటం, అది అరగటానికి మందులు వేసుకొనుట, క్షణకాలం కూడ విశ్రాంతి లేకుండా ఈ పొట్టను నింపటానికి ప్రయత్నించే సంస్కారమే మనకు పంధి జన్మనుండి వచ్చింది ప్రపంచంలో ఏ మిషనైనా కొంతసేపు పని చేసిన తర్వాత విశ్రాంతిని కోరుతుంది. కాని పరమాత్మచే చేయబడిన ఈ మిషెన్‌కు మాత్రం (జీర్ణాశయం) క్షణ కాల విశ్రాంతి లభించదు. నిద్రా సమయంలో తప్ప నిరంతరం ఈ తోలు

సంచిని నింపుటకే ప్రయత్నము చేస్తున్నాము, దానికి సహాయకారులుగా ప్రతి రెండు గజములకు ఒక హోటలో, ఒక బేకరి షాపో, ఒక స్వీట్‌స్టాలో ప్రత్యక్షమై మనలను ఆకర్షిస్తున్నాయి. ఈ తిండిబోతునం గుర్తు వచ్చినప్పుడు అది పంది జన్మ నుండి వచ్చిన వాసనగా గుర్తించ గలిగితే మనకా తిండి తాపత్రయం పోతుంది. ఎవరైనా మనకు చిన్న సహాయం చేస్తే మరచిపోకుండా వారియందు విశ్వాసము కలిగియుండుట తిరిగి వారి కొఱకేమైనా చేయాలనుకోవటం కుక్క జన్మ నుండి మనకు వచ్చిన సంస్కారము. ఏదైనా ఒక విషయము తెలిసినప్పుడు అది మంచిదైన చెడుదైనా పదిమందికి చెప్పాలనుకోవటం కాకి జన్మ నుండి వచ్చిన సంస్కారము, ఇలా అనేక జన్మలు ఎత్తి మానవ జన్మకు వచ్చిన మనలో ఈ జన్మల సంస్కారాలన్నీ కలగా పులగంగా నిండి ఉన్నాయి. వీటిని పరిశీలించుటయే మనము 'కాళీ' ని ఉపాసించటము. అంతే కాని కాళిమాత బొమ్మను పెట్టుకొని టెంకాయ, పూలు పండ్లు తీసుకొని పూజించటం ఆ తల్లిని ఉపాసించటం కాదు. పూజకు అర్థం మళ్ళీ మరొకచోట చెప్పుకుందాము. మనలో అనేక జన్మల నుండి వచ్చిన వాసనలను ముందు మనం గ్రహిస్తే వాటినెలా పోగొట్టుకోవాలో తర్వాత తెలుసుకొన ప్రయత్నించవచ్చు. జంతు ప్రపంచం నుండి దైవత్వం వైపు మళ్ళించటానికి మనము కాళీమాతను శరణుపొందాలి. ''జంతూనాం నరజన్మ దుర్లభమ్'' అని శంకరుడు వివేక చూడామణిలో చెప్పెను కదా. అట్టిదుర్లభమైన ఉత్కృష్ట మైన మానవ జన్మ

లభ్యమైకూడ మాధవత్వాన్ని బ్రహ్మత్వాన్ని పొందటానికి ప్రయత్నించక వెనుకటి జన్మల సంస్కారిన్ని పునః పునః అచరిస్తూపోతే తిరిగి అలాంటి యోనుల యందే జన్మించవలసి వస్తుంది. అందుకే ఈ జన్మలో నేనెవరు? ఈ దేహము ధరించక ముందు నేనెక్కడున్నాను? దేహపతనానంతరం ఎక్కడికి వెళతాను? అన్న మూడు ప్రశ్నలకు సమాధానం తెలుసుకోవాలి. అది తెలుసుకోవటానికి ప్రయత్నించి తెలుసుకో లేక మృతి చెందినా ఇదిమరు జన్మకు సంస్కారమై

"శుచానాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోభిజాయితీ

(గీత 6-41)

అని శుచి మంతులైన శ్రీమంతుల ఇండ్లలో పుట్టి పై ప్రశ్నలకు సమాధానం తేలుసుకోవటానికి ప్రయత్నిస్తారు. వాటి సమాధానము కొఱకే సద్గురు సాన్నిధ్యం చేరుకోవాలి.

'తద్విద్ధి ప్రణిపాతేనపరి ప్రశ్నే సేవయా
ఉపదేక్ష్యంతుతే జ్ఞానం జ్ఞాని నత్త్వ దర్శినం'

(గీత 4-34)

అన్నట్లు దాన్ని తెలుసుకోటానికి సద్గురువుకు సాష్టాంగ నమస్కారము చేసి పరి ప్రశ్న వేయాలి. జవాబు తనకు తెలిసి ఎదుట వాని నడిగేది ప్రశ్నయని తెలుసుకోవాలనే

జిజ్ఞాసతో అడిగేది పరి ప్రశ్నయని పెద్దలంటారు. పై మూడు ప్రశ్నలకు జవాబుకై మనం ప్రయత్నించుటకు కాళీ ఉపాసనకు ఉద్యుక్తులవటం. ఇంతకు ముందు మనమనుకున్న క్రూర స్వభావాల్నే రాక్షస అసురీ ప్రవృత్తులని (ఇతరుల బాధించేవి) జంతు ప్రవత్తులని (విజ్ఞానం లేనివి) అవి మనలో ఉన్నాయని మనకు నిర్ధారణ అయింది. ఇంకా మనలో రాక్షస అసురీ ప్రవృత్తు లెలా ఉన్నాయో పరికిద్దాము.

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానావి చేతనః
రాక్షసీయాసురీంచైవ ప్రవృతిం మోహినీం శ్రితా (గీత)

అని గీతలో చెప్పినట్లు మనలో నున్న అసురీ గుణములను మననం చేసుకుందాము.

లాటరీ టికెట్లు కొనాలనితద్వార కోటీశ్వరులం కావాలని గుఱ్ఱపు పందాలలో, మట్కాలలో, జూదంలో ధనం సంపాదించాలని దాని కోసం ఉన్నదాన్ని గూడ పోగొట్టుకోవటం, 'మోహమే' అవుతుంది. తృప్తి చెందని 'మనజుడు సప్త ద్వీపములనైన జక్కంబడునే' (భాగవతం)

భగవంతుడు తనకిచ్చిన దానిని తృప్తిగా అనుభవించక ఏదేదో కావాలని గాలిలో మేడలు కట్టడం వ్యర్ధమే అవుతుంది. స్వధర్మాన్ని విస్మరించుటకూడ అసురీ ప్రవృత్తియే అవుతుంది

'స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః
(గీత 3-35)

అని గీతాచార్యుడు చెప్పినట్లు కష్టమైన దైనను స్వధర్మ మును విడువరాదు. అట్లుగాక నేడు మన దేశములో మేధావు లందరు ధనాశతో ఇతర దేశములకు వెళ్ళిపోవుచున్నారు. మన ప్రభుత్వ ధనంతో విద్యావంతులై ఆ విద్యను దేశవాసులకై వినియోగించక కేవలం ధన సంపాదనయే ముఖ్యముగా నెంచి అమెరికా మున్నగు సంపన్న దేశములకు పోయి అక్కడి పౌరుల మనిపించుకొనుటకు సిగ్గు జెందుటలేదు. పైపెచ్చుమన దేశ సంస్కృతిని విమర్శింప బూనుచున్నారు. మానవ ప్రవృత్తిలోనే ఈ ఆసురీ సంపద చోటు చేసుకున్నది. ఏ పని చేయువివాడి కాపని గొప్పగా అనిపించక ఎదుటివాడి పనియే శ్రేష్ఠముగా కనిపించును. ఉద్యోగి వ్యాపారియే సుఖపడునని వ్యాపారి ఉద్యోగమును మించిన సుఖము లేదనును. సంసారి సన్యాసికి సుఖమనిన సన్యాసి సుఖము సంసారములోనే ఉన్నదనును, ఈ ఆసురీ సంపద వలన స్వకర్మ యందు ద్వేషము పరకర్మ యందు అనురాగమును కలుగుచున్నవి. వ్యర్థ జ్ఞానము కూడ అసురీ ప్రవృత్తిలోకే వచ్చును. ప్రపంచ ములో తనకు తెలిసినది బహు తక్కువ అయినను చాలా తెలుసునని నటించుటకు ప్రయత్నింతురు. తనకు తెలియదని వప్పుకొనుట నామోషిగా తలంతురు. మరికొందరు తామే మేధావులమనుకొని అందరును తమకంటికి తక్కువయని

భావించి అందరితో కలిసి ఉండుటకు నిరాకరింతురు. అట్టి వారెంత జ్ఞానులైనను వారి జ్ఞానము నిరర్ధకమే కదా.

కొందరు హింసారూపమైన కామదర్పాదులకు లోనై కృతిమమైన గౌరవము ప్రదర్శించటానికి ప్రయత్నిస్తారు. రాక్షస ప్రవృత్తిని విడువవలెనన్న ప్రతియొక్కరు నేనెవరు? ఇతరుల దృష్టిలో నేనెవరు? అని ప్రశ్నించుకోవలెను. ఎదుటివారు తనను జూచి సంపన్నుడనో, మేధావియనో అనుకుందురు. నిజముగా తాను సంపన్నుడో మేధావియో తనకు తెలియదా? తనకేది తెలుసునే అది తన దృష్టిలో తాను, ఏదుటివారి కేది కనిపించుచున్నదో ఎదుటివారి దృష్టిలో అది తాను యదార్థముగా తాను దేహమా? మనస్సా? ఇంద్రియములా? వాటినన్నింటికి సాక్షిగానున్న బ్రహ్మస్వరూపుడా? ఆ విషయమైన ఆలోచనే తనకు రాకపోవుట వలన కామ దర్పాదులకు లోనై వాడు ప్రవర్తించును. హిరణ్యకశ్యపుడు అనుక్షణం శత్రు భయముతో హరినామ స్మరణము చేయుటకు కారణము హరియనిన అతనికి గల భయమే కదా! అట్లే ఈ ప్రపంచములో తానొక ప్రముఖ వ్యక్తిగా గుర్తించబడవలెనను అసురీ గుణమే హింసారూపమైన కామదర్పాదులకు లోబడునట్లు చేయును. మనము సంపాదించు డిగ్రీలు మన వెంటరావు.

"ధనాని భూమౌ పశువశ్చగోష్ఠె నారీముఖ ద్వారీ
బంధుస్మశానే దేహశ్చితాయం పరలోక మార్గె కర్మాను
గోగచ్ఛతి జీవ ఏకః"

అను శ్లోకాను సారము మనము సంపాదించిన ధనము విద్యాధనమైనను, పశుధనమైనను, బంగారు నాణెములైనను ఈ లోకముననే వదలి పోవలెను. ఎంతో ప్రేమించి మనచె పోషింపబడిన ఇల్లాలు గృహ ద్వారము వరకే వచ్చును. బంధువులు స్మశానము వరకు వచ్చి తిరిగి చూచిన తమను దయ్యమై పట్టునను భయముతో తిరిగి చూడక వెళ్ళిపోదురు మనము చేసినపుణ్య పాపకర్మలు మాత్రము పరలోకమార్గమున మనతోడునిడై మన వెంటవచ్చును. ఆ విషయమును విస్మరించి భౌతికమైన పొట్టకూటి చదువులు చదువుటకై మనసమయ మంతయు వ్యర్థముచేయుచున్నాము 'చదువుచదివిచదివిచావంగ నేటికిచావులేని చదువుచదువ వలయు'నన్నట్లు చావులేనిచదువు చదివి పిదప ఈ పొట్టకూటి చదువు చదువ వచ్చును. దీనికై (డిగ్రీలకై) మన సమయమును వ్యర్థము చేయుచున్నాము. ఆహార నిద్రాభయమైదునాని సామాన్య మేతత్ పశుభిర్నరాణామ్ (ఉత్తరగీత 2-44) అన్నట్లు తినుట, నిద్రించుట, భయపడుట జాతినభివృద్ధి జేయుట, యివన్నియు పశువులకు మానవులకు సమానము, మానవులకు గల బుద్ధి వివేకము పశువుల నుండి వానిని వేరు చేయుచున్నది. అట్టి వివేకము గల మానవుడు వ్యర్థ విషయములపై తన బుద్ధిని కేంద్రీకరించు చున్నాడు. ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థ ములలో నాల్గవ పురుషార్థమును సంపాదించుట మానవుని కర్త వ్యము. అది మరచి మొదటి మూడింటితో తృప్తి జెందిన మానవునకు పశువునకు తేడా యుండదు.

మన దేహము పంచ భూతములతో నిర్మితమైనది. ఆ భూతములు పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అనునవి. ఇందు ఒక్కటి గూడ ఉత్కృష్టమైన స్థితిని గురించి ఆలోచించదు. అట్టి భూతముల సమ్మేళనమువలన తయారైన మనకు ఉత్కృష్టమైన ఆలోచనలు ఎట్లు వచ్చును? భూమి స్తబ్దముగా నుండునది. నీరు అను నిత్యము పల్లమునకే ప్రవహించును. అగ్ని సమస్తమును దహించు స్వభావము కలది. అన్నింటిని తనలోని ముడ్చుకొను స్వభావము దానిది. వాయువు నిలకడ లేనిది. అల్ప పీడనము నుండి అధిక పీడనమునకును, అధిక పీడనము నుండి అల్ప పీడనమునకును మారుచుండును. ఆకాశము శూన్యము. ఇక దేహ తత్వమును విచారింతము. స్తబ్దముగా ఎక్కడో చూచుట ఏదోచోట చూచుకొని ఎప్పుడును పరుండవలె ననుకొనుట, నీచమైన విషయముల మీదికి ఎప్పుడును మనస్సు పోవుట వారింట ఏమి జరిగెనో వీరింట ఏమి జరుగుచున్నదో తెలుసుకొనవలెననెడి ఉత్సుకత జల స్వభావమే. ఇతరులను నాశనము చేసి అయినా వారి సంపదను దోచుకోనవలె ననునది అగ్ని స్వభావము. వాయువు నిలకడ లేనిది, అట్లె మానవునకు స్థిరచిత్తముండదు. ఎంత యున్నను తృప్తి లేక యింకను కావలెనని కోరుచుండును. ఇది వాయు స్వభావము. ప్రతి వారినీ ఏమి చేయుచున్నావని అడుగగా ఏమియు లేదనును. ఇది శూన్యత్వం ఆకాశతత్వము. ఇట్టి వానితో తయారైన ఈ దేహము నుండి మనమేమి ఆశించగలము? అనగా ఈ దేహము

అత్యున్నతమైన మోక్ష పథమును పొందలేదు. ఈ దేహములో 'దేహి' యని ఒకడున్నాడు. వాడు మోక్షమును పొందగలడు.

దేహో దేవాలయ ప్రోక్తో జీవో దేవస్సనాతనః
(ఉత్తరగీత 4-25)

అన్నట్లు ఈ దేహమే ఒక దేవాలయము. అందులో సనాతనుడైన జీవుడు నివసిస్తున్నాడు.

మహాత్మనస్తు మాం పార్ధ దైవీం పకృతి మాశ్రితాః
భజ న్త్యాననన్య మనసో జ్ఞాత్వా భూతాధి మవ్యయమ్
(గీత 9-13)

మహాత్ములు దేవతా సంబంధమైన నా ప్రకృతి నాశ్రయించి సర్వ భూత కారణుడైన నన్నే పొందుచున్నారు. గీతాచార్యుని వాక్యాను సారము దైవీ సంపద నాశ్రయించి పరమాత్మను పొందవచ్చు. అట్టి ప్రయత్నము నెవరు చేయుదురో వారిలో దైవీ సంపద కలదని తెలుసుకొన వలెను. ఒక వ్యక్తిని చూడగనే ఆ వ్యక్తి వ్యక్తిగా కనిపించక అందులో కలదేహిగా కన్పించవలెను. అట్లుగాక దేహదృష్టియే కలిగిన మనలో ఇంకా అసురీ సంపద కలదని తెలుసుకోవలెను. ఎవరినైనా మనం చూడగానే ఆ వ్యక్తి యింటికి మనం వెళ్ళినపుడు వాళ్ళు మనల్ని ఎలా చూచారో ఆదరించారో జ్ఞాపకం చేసేది మనలోని

మన మహర్షులు సంప్రజ్ఞాత సమాధిలో ఆ దైవమును, ఆయన లక్షణములను వీక్షించి, ఆయా దేవతల స్వరూపాన్ని, స్వభావాన్ని, వారి కృత్యాలను మనకు మంత్ర రూపంగా తెలియజేశారు. అవన్నీ సంస్కృత భాషలో నుండుట వలన మనకు అర్థము కావడంలేదు. దేవతలున్నారా? లేరా? అన్న ప్రశ్నకు ఆత్మజ్ఞులైన పండితులు దేవతలునా రని వారు మన దేహములోనే ఒక్కొక్క స్థానాన్ని బట్టి ఒక్కొక్క వ్యవహారము చేస్తుంటారని వివరపరిచారు. వారు డాకిని (విశుద్ధ) రాకిని (అనాహతము) లాకిని (మణిపురకము) కాకిని (స్వాధిష్ఠానము) సాకిని (మూలాధారము) హాకిని (అజ్ఞ) యాకిని (సహస్ర) అను పేళ్ళతో మన శరీరంలోనే కంఠస్థానమును, హృదయస్థానమును నాభి స్థానమును ఉపస్థ పాయు స్థానములలోను, భృకుటి-సహస్రారములలో క్రమముగా నుండి ఆయా కార్యముల చేయుచున్నారు. హయగ్రీ వాగస్త్య సంవాదములో ఈ క్రింద కనబరచిన లలితా సహస్ర నామముల ద్వారా ఈ విషయము అవగతమగుచున్నది.

విశుద్ధ చక్ర నిలయా అరక్త వర్ణాత్రిలోచనా ఖట్వాంగాది ప్రహరణా వదనైక సమన్వితా పాయసాన్న ప్రియాత్వక్స్థా పశులోక భయంకరీ అమృతాది మహాశక్తి సంవృతాడాకినీశ్వరీ

(లలితా 2-98-25)

విశుద్ధమను కంఠస్థానమున నివసించి గులాబి రంగు కలిగి మూడు కన్నులతో 'అ' నుండి 'ఖ' వరకు గల అక్షరము లను సేసికలతో సేవింపబడుచు మన దేహములోని చర్మమును కాపాడుచు మనలోని పాశవిక గుణములకు భయమును కలిగించుచు రక్తమాంసాదులతో అసహ్యముగా నున్న దేహ మును అందముగా కప్పి కాపాడుచు ఉన్న తల్లి 'డాకిని' అను పేరుగల దేవత (ఇవన్నియు భావనా రూపములే కాని యదార్థ ముగా భగవంతునకొక రూపము లేదు.)

అనాహతాబ్జ నిలయా శ్యామాభావ ధన ద్వయా
దంష్ట్రోజ్వలా అక్షమాలాది ధరా రుధిర సంస్థితా
కాళరాత్ర్యాది శక్త్యౌ ఘువృతా స్నిగ్ధౌ దనప్రియా
మహావీరేంద్ర వరదారా కిన్యంచా స్వరూపిణీ.

(లలిత 2-99-101)

అనాహతమను హృదయస్థానమునవసించి శ్యామలవర్ణము కలిగి రెండు ముఖములతో జ్వలించు కోరలు కలిగి అక్ష మాలను చేత ధరించి రక్త ప్రసారమును చక్కగా జరిపించుచూ 'గ' నుండి 'ఠ' వరకు గల అక్షరములతో సేవింపబడుచు నేతితో కలిపిన పొంగలిని ఆహారముగా తీసుకొనుచు కాకిని అను దేవత హృదయ స్థానమందు వసించుచున్నది.

మణిపురాబ్జ నిలయా వదన త్రయసంయుతా
వజ్రాదికాయుధో పేత డామర్యాది భిరావృతా
రక్త వర్ణా మాంస నిష్ఠా గుడాన్న ప్రీత మానసా
సమస్త భక్త సుఖదా లాకిన్యంబా స్వరూపిణీ

(లలిత 2-102-103)

నాభి స్థానము నందు మూడు ముఖములు కలిగి వజ్రాయుధమును ధరించి 'డ' నుండి 'ప' వరకు గల అక్షరములచే సేవింపబడుచూ ఎఱ్ఱని రంగు కలిగి మన శరీరమందలి మాంసమును కాపాడుచూ మన శరీరమునకొక ఆకారము కలిగించి బెల్లమును, అన్నమును ఆహారముగా స్వీకరించి సమస్త భక్తులకు సుఖము నిచ్చునట్టి 'డాకిని' అను పేరుగల తల్లి గలదు. దీనిని గ్రహించలేక దేవికి మాంసము ఇష్టమని ప్రాణులను బలియిచ్చుట సంభవించుచున్నది.

స్వాధిష్ఠానాంబు చ.గతా. చతుర్వక్త్ర మనోహరా
శూలాద్యాయుధ సంపన్నా పీత వర్ణాతి గర్వితా
మేదో నిష్టామదు ప్రీతా బందిన్యాది సమన్వితా
దధ్యాన్నాసక్త హృదయా హాకినీ రూపధారిణీ

(లలిత 2-104-105)

స్వాధిష్ఠానమను ఉపస్థామందు నాలుగు ముఖములు కలిగి మనోహరమైన రూపముతో శూలము మొదలైన అయుధములను చేబూని పసుపు రంగు గలిగి అహంకార పూరితముగ మేధస్సును కాపాడుచూ తేనెయందాసక్తి గలిగి 'బ' నుండి ల' వరకు గల అక్షరములతో సేవింపబడుచు పెరుగు అన్నమును భుజించు కాకిని అనుపేరుగల తల్లి గలదు.

మూలాధారలబు జారూఢా పంచవక్త్రాస్థి సంస్థితా
అంకుశాది ప్రహరణావర దాధి నిషెవితా
ముద్గౌదనాసక్త చిత్తా సాకిన్యంబా స్వరూపిణీ

(లలిత 2-106-107)

పాయు స్థానమందు వసించి ఐదు ముఖములు గలిగి ఎముకలను కాపాడుచు అంకుశమను ఆయుధమును బూని 'మ' నుండి 'స' వరకు గల అక్షరములచే సేవింపబడుచు పులగము నాహారముగా స్వీకరించు సాకిని అను పేరుగల తల్లి గలదు.

అజ్ఞా చక్రాబ్జనిలయా శుక్లవర్ణా షాడాననా
మజ్జాసం స్థాహంసవతీ ముఖ్యాశక్తి సమన్వితా
హరిద్రాన్నైక రసికా హాకిని రూపధారిణీ

(లలిత 2-107-108)

ఆజ్ఞా చక్రము భ్రుకుటి స్థానమందు శ్వేతవర్ణము కలిగి అరు ముఖములతో, మజ్జను కాపాడుచూ 'హం' క్షం అను అక్షరములచే సేవింపబడుచు ముఖ్యమైన (శరీరమున కవసరమగు) శక్తిని దయచేయుచు, పులిహోరను ఆహారముగా గలిగి 'హాకిని' అను పేరుగల తల్లి ఉండును.

సహస్రదళ పద్మస్థా సర్వవర్ణోప శోభితా
సర్వాయుధ ధరా శుక్ల సంస్థితా సర్వతోముఖీ
సర్వౌదన ప్రీతి చిత్తా యాకిన్యంబా స్వరూపిణీ

(లలిత 2-108-109)

సహస్రారమను శిరోపరి భాగమందు సర్వ వర్ణములతో సర్వాయుధములను ధరించి శుక్లమును కాపాడుచు అన్ని విధములైన అన్నములను స్వీకరించుచూ యాకిని అను పేరు గల తల్లి గలదు.

ఈ విధముగా చిద్రూపిణి యైన పరమేశ్వరి మన శరీరములోని ఆయా స్థానములందుండి మన రక్తమును, మాంసమును, చర్మమును, మేధస్సును, ఎముకలను, మజ్జను మరియు శుక్లమును కాపాడుచున్నది. ఆ తల్లిని గ్రహించలేక మానవుడు అనేక గ్రామ దేవతలనూహించు కొనుచున్నాడు. భగవాన్ రమణులు మొదట నీవెవరవో తెలుసుకో, పిదప భగవదారాధన చేయుము అన్నారు. జన్మ మృత్యుజరాతప్త

జన విశ్రాంతి దాయనీ (లలిత 2-159) అని తల్లికి మరోపేరు పుట్టుక చావు ముసలితనము చేత బాధపడు జనులకు విశ్రాంతి నిచ్చునది అని అర్థము.

అంతర్ముఖ సమారాధ్యా బహిర్ముఖ సుదుర్లభా (2 162) ఆ తల్లి అంతర్ముఖమైన వారికి మాత్రమే తెలియబడునది. బాహ్యములో ఆమెకు కనిపించదని పెద్దలు చెప్పుచున్నారు. ఒక్కసారి సుఖాసీనుడవై యోచన చేస్తే ఎన్నో జన్మల నుండి మనలో పేరుకుపోయిన పాశవిక గుణాలు, సంస్కారాలు కనిపిస్తాయి. వెంటనే వాటిని ప్రారదోలటానికి ప్రయత్నం చేయాలి. అలా చేయకపోతె మనము దసరా పండుగను జరుపుకోనట్లే, చైతన్యార్ఘ్య సమారాధ్యా చైతన్య కుసుమ ప్రియా (2-170) అని దేవికి మరొక పేరు. చైతన్య కుసుమ ములనగా కదిలెడి పూవులు, కదిలెడి పువ్వు మనస్సు గాక మరేమున్నది? చిత్స్వరూపమై చైతన్య కుసుమ మైన హృదయ కుసుమమును తల్లికర్పించుట మాని అర్థముకాని మూఢత్వ ముతో మత్స్యము (చేపల) మాంసము, మద్యము, మగువలను నివేదన చేయుచున్నారు. అభిచార హెూమము చేసి నివేదిం చుట అట్టిదే. మామూలు పూవులు చైతన్య కుసుమములు కావు. చెట్టు నుండి వేరు చేసిన కొంతసేపటికి వాడిపోవును. చెట్టుననే యుంచినను అవి వాడిపోవును. అట్టి వాడని కుసుమము ఆత్మయే ఆత్మార్పణము చేయుటయే తల్లికి నిజమైన నివేదన.

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం

(గీత 9-22)

అని గీతాచార్యుడన్నట్లు అన్ని చింతలుమాని తననే శరణుజొచ్చిన వారి యోగక్షేమములను భగవానుడు స్వయముగా స్వీకరించును. సాధారణముగా ఒక పురోహితుడు ఈనాడు అమావాస్య అని ద్వాదశియని మంచిరోజు కాదని, మంచిరోజని చెప్పగా నమ్ముదుము. పరమాత్మ స్వయముగా చెప్పిన మాట వినము కదా. ఒక ధనవంతుని మన ఇంట్లో వివాహనిమిత్తమై ధన సహాయమడిగిన అతనిచ్చెదనని మాట యిచ్చిన ధైర్యముతో పనులు ప్రారంభించి చెసుకొందుము కదా. సాక్షాత్ పరమాత్ముడు అన్నిటిని వదలి నాయందే మనసు లగ్నము చేసినచో నీ యోగక్షేమములను చూతుననగా ఆ మాట నమ్మరు ఎంత విచిత్రము. ఒక ధనవంతుడిచ్చిన మాటకంటె పరమాత్ముడిచ్చిన మాటకు విలువ నిచ్చుట లేదు. ఎంతకునూ తానే గొప్పవాడని, తానే బుద్ధివంతుడనని, తానే తెలివిగలవాడనని అహంకరించును. చిన్న దానము చేయువలసి వచ్చినను తన పేరు ప్రకటించనిదే దానము చేయడు కదా. నేనింత మందిని చంపాను, ఇంకా ఇంత మందిని చంపాలి. నా జోలికివస్తే ఊరుకోను. నాకు కోపం వస్తే మనిషినికాను. నేనెలాంటివాడనో నీకేమి తెలుసు? ఇత్యాది పలుకులు మనకు వినపడినపుడు వాళ్ళు అసురీ సంపదలో ఉన్నారని గ్రహించాలి

తననుతాను పొగుడుకొనుట, పెద్దలను నిరసించుట దాతృత్వ బుద్ధితో కాక దానము చేయుట, శాస్త్రసమ్మతము కాని యజ్ఞము లు చేయుట, తనకేమి తెలియకున్నను సమస్తము తెలుసునని కాషాయ వస్త్రములు ధరించి ప్రజలను మోసము చేయుట, ఇవన్నియు అసురీ గుణములు. ''అహంకారం, బలం, దర్పం, కామం క్రోధంచ సంశ్రితాః మమాత్మపరదేహేషు ప్రద్విషంతోఖ్యసూయకాః'' (గీత 6-16) అని గీతలో చెప్పినట్లు పరశ్రేయస్సును సహించలేకపోవుట, ఇతరులలో తప్పులెన్ను టకు ప్రయత్నించుట అసురీ సంపదయే అట్టి సంపదకలవారిని గీతాచార్యుడు నరాధములని సంసార చక్రంలో మరల మరల పడక తప్పదని సెలవిచ్చి యున్నాడు. శాస్త్ర విరుద్ధంగా ఆచరించేవాడు.

''న ససిద్ధిమవాప్నోతిన సుఖం నపరాంగతిః

(16-23)

అని అతడు సిద్ధిని సుఖమును పొందలేక పోగ పరలోక మందు గూడ వాడికి ఉత్తమ గతులుండవు. అసురీ గుణము లను పారద్రోలుటకు మనము ప్రయత్నించవలెను. వాటిని కాళీమాతకు బలి యివ్వవలెను. అదే నిజమైన రాక్షస సంహార మగును. సహజముగా మానవుడు బాహ్య శత్రువులను గ్రహించ గలడేగాని అంతశ్శత్రువులను గుర్తించలేడు. వస్తువులను పట్టుకొనుటకు ఉపయోగపడు పట్టుకార చేతిని పట్టుకొనలేదు కదా.

కామక్రోధశ్చ లోభశ్చ దేహేతిష్టంతి తస్కరాః
జ్ఞానరత్నాపహారయ తస్మాత్ జాగ్రత జాగ్రత''

అని శంకర భగవత్పాదులు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములను ఆరుగురు దొంగలు మన జ్ఞానరత్న ములను అపహరించుటకై మన దేహమందు నివసించియున్నా రని సెలవిచ్చెను. అట్టి దొంగలను కనుగొనుట నీకు సాధ్యము కాదు. అందుకే కబీరు ''నిందక్ నియరేరాఖియే ఆంగనకుటీ భవాయే బినోసాబున్ పాని బినా నిర్మలకరైదువాయె (కబీరు దోహా) అని చెప్పెను. నిన్ను నిందించువానిని నీ యెదుట నుంచుకొనవలెను. సబ్బు నీరు లేకుండానే నీలోని దుర్గుణ ములు ఉతకబడును. ఎదుటివాని ముందు మన తప్పులను దాచి మనలను కాపాడుచు మన యందు మన తప్పులను నిర్భయముగా చెప్పగలవాడే నిజమైన స్నేహితుడు. మన పరిచయస్తులు, మనమేలు కాంక్షించువారు. తమ మేలు కై మనలనర్థించువారు ఎందరో దొరకవచ్చు. కాని మనలోని లోపములను సరిదిద్ది మనలను మాధావులుగా తీర్చిదిద్దిగల వారు మనకు దొరకరు. తల్లిగా లాలించి తండ్రిగా జ్ఞానభిక్ష డి పోషించి సఖునిగా మనలోని తప్పులను దిద్ది మన కుపదేశము చేయగల సమర్థుడు సద్గురువొక్కడే, గురువాక్యము, శాస్త్ర ప్రమాణము, స్వానుభవము, ముక్తి సోపానాలని పెద్దలు ఆజ్ఞాపించారు. ముందు గురువాక్యాన్ని విని స్వానుభవమును సంపాదించి తానుపొందినది సత్యమౌనో కాదో శాస్త్రప్రమాణము ద్వారా దానిని స్వంతం చేసుకొంటే ముక్తి కరతలామలక మవుతుంది.

''నగురోరధిక మేశివ శాసనతః (గురుగీత)

అని ఈశ్వరుడు గురువును మించి మరెవ్వరులేరని శాసనము చేసెను. అసలు శాస్త్రాలు అర్థం కావు. స్వానుభవమును సంపాదించిన తరువాత అంతకు ముందు మనచే చదువబడిన శాస్త్రమే మరొక విధముగా మన కర్థమవటం మొదలుపెడుతుంది.

ఈ విధంగా పాశవిక శక్తుల నణచి (పశుతత్వాన్ని విచారణ ద్వారా గుర్తించి) మానవత్వాన్ని పొందటం కోసం పశుత్వాన్ని తత్సంస్కారాలకు బలి యివ్వాలి, నీచ సంకల్పాన్ని పోగొట్టుకోవాలనే దృఢ సంకల్పం కలిగితే దుర్గామాత వాటిని హతమారుస్తుంది. అదే నిజమైన పశుబలి. దసరాలలో మూడవదినం కాళీమాతకు బలి యిచ్చేరోజు. వామాచార పద్ధతిలో అల్లప్పు ముక్కలను కోసి రాగి చెంబులో పానకంబెట్టి నిమ్మకాయలు కోసి బ్రాహ్మణులు, కోడినికోసి అబ్రాహ్మణులు ఈ పశుబలి కార్యక్రమాన్ని చేస్తూ ఉంటారు. నిజంగా మనలోని పశుత్వాన్ని బలి యివ్వాలి. ఒక నిర్మాణ క్రియ వెనుక ఒక విచ్ఛిన్న క్రియ, ఒక విచ్ఛిన్నక్రియ తరువాత ఒక నిర్మాణ క్రియ ఎలా సాగుతాయో అలాగే మనలో పశుత్వం నశించడం వెనుక మానవత్వం పెంపొంటమనే నిర్మాణ క్రియ జరుగుతుంది. దుర్గామాత ''పాశహస్తా'' అని చేతిలో పాశంతో మనలను బంధించి మనం పశుత్వాన్ని బలి యివ్వగానే ఆమె క్రియాశక్తిగా మారి మన కార్య సాధనకు తోడ్పడుతుంది.

నిప్పులో నెయ్యి వేసిన కొలది మండటం ఎలా నిప్పుకు సహజ స్వభావమో అలాగే కోరికలు తీర్చేకొద్దీ కోరటం మనస్సుకు స్వభావము. నిరోధ సంస్కారం ద్వారా మనస్సును లొబర్చుకోవలే కాని ఇంద్రియ నిగ్రహం అసాధ్యము. మనస్సును నిగ్రహించుటం చాలా కష్టము. సప్తవారిధులు క్షణంలో ఈదగలనని కులపర్వతాలను అచ్చన గుండ్లుగా ఆడగలనని, ఆంజనేయుడు రామునితో అంటాడు.

అలయక సప్త వారిధుల నావలకీవలికొక్క రీతిగా
గలయగ నీద వచ్చును నగంబుల నచ్చనగుండ్లుగా
గరంబులగాని యాడవచ్చు నభమునో గబళింపగ వచ్చు
గాని యియ్యల నమనస్క యోగము గ్రహింపగ రాదు
దలంప నేరికినో

(సీతారామాంజనేయ సంవాదము 3-38)

చెలువుగ బువ్వులు జోరుట కంటెన్ బొలుపుగగన్నవ
మూయుట కంటెన్ నలువగు నీయ మనస్కపదంచే
సులభము, సౌఖ్యము, సూక్ష్మము వత్సా

(సీతారామాంజనేయ సంవాదము 3-41)

రాముడు దానికి సమాధానంగా మనస్సును గురించి చక్కగా విచారిస్తే దానిని నిరొధించటం పువ్వులు కోయడం

కంటె, కన్నులు మూయటం కంటె తేలికని అట్టి మనో
నిగ్రహాన్ని నిరోధ సంస్కారం ద్వారా సాధించ వచ్చునని
చెప్పాడు. మనస్సు ఎన్ని కోర్కెలు తీర్చినను మరల మరల
అడుగుతూనే ఉంటుంది. మొక్కగా ఉన్నప్పుడే వంచితే
మనమెలా కావలయుననుకుంటే అలా మలుచుకొవచ్చు అది
మానైన తరువాత లొంగదు. మనకై మనము మనస్సును
నిగ్రహింపాలంటే అది అసాధ్యము. సీసాలో గాలికొడితే సీసా
పగులుతుందే కాని కాని గాలిని యిముడ్చుకోలేదు. సద్గురు
సాన్నిధ్యంలో గురువు చేత మనస్సు కట్టివేయబడుతుంది.
రాముడన్నట్లు పుష్పాలు కోయటం కంటే, కనుగవ మూయటం
కంటే మనస్సును నిరోధించటం సులభమే. సద్గురువు
దొరుకునంత వరకు మనస్సును, వదలి వేయకుండా లొంగ
దీసుకోవటానికే మన పెద్దలు ఉపవాసం చేయమని, జాగరణ
చేయమని మనస్సు కోరిన వానినివ్వకుండా వుండమని
పంచదార తక్కువైతే లేచి వెళ్ళి తెచ్చుకొకుండా అలాగే టీ
త్రాగటం అలవాటు చేసుకోమ్మని, లక్ష్య సాధనకై మనస్సును
సంసిద్ధం చేయమని గురువు దొరికిన తరువాత వారి శక్తితో అది
నిలబడుతుందని చెప్పారు. సజీవమైన గురువు దొరకకపోతే
భావ గురువుగా శ్రీ రామకృష్ణ పరమ హంసను పెట్టుకొని
ధ్యానం ఆరంభిస్తే ఆయనే గురువును పంపుతారు. ఏకలవ్యు
నకు ద్రోణుని ప్రతిమ అస్త్రవిద్యా రహస్యాల్ని బోధించలేదా?
అలాగే రామకృష్ణులు వేదాంతము తప్పక బోధిస్తారు. మనలో
పశువును మరణింపజేసి మానివృత్తి మేల్కొల్పితే ఆ మానవుడే

మాధవుడవటానికి ప్రయత్నిస్తాము. రైల్వేట్రాక్ మీద ట్రాలీని కొంత దూరము నెట్టి దానిమీద ఎక్కి కూర్చుంటే పెట్రోల్, డిసెల్ ఆయిల్ లేకుండా అదే నడుస్తుంది. మనలో అవిద్య ఆవరణ, విక్షేపము అనే మూడు మలములున్నవి. పశుత్వాన్ని బలి యిస్తే మనలో అవిద్య అనే మలం పోతుంది, దేవి మహిషాసుర సంహారం చెసిందంటే యిదే అర్ధము. తనకు తోచకపోవడము, ఒకరు చెపితే వినకపోవటము అనే ప్రవృత్తి మనలో నున్న మహిషాసురుడు దేవి మనసులోవున్న ఆ రాక్షస సంహారం చేస్తుంది. మధ ఆకైటభులు క్రిమి రూపంగా ఉన్నారని వారు తమోగుణ ప్రధానులని మనలోతమోగుణాన్ని హరింప చేసుకుంటే మధుకైటభ సంహారమైనట్లేనని గ్రహించాలి. దేవుడికీ. జీవుడికీ మధ్య అడ్డు అవిద్య, ఆవరణ, విక్షేపాలే అట్టి అవిద్యను తొలగించుకుంటే అడ్డు దానంతటఅదే తొలగి పోతుంది. దీపం వెలిగిస్తె చీకటిని ప్రార్ధించ నవసరం లేదు. కామ, క్రోధ, లోభములను స్వప్రయత్నంతో నాశనం చేసుకొంటే వానిలో మానవత్వం నెలకొల్పటానికి భగవంతుడు సహాయపడుతాడు.

ఏ తైరి ముక్తః కౌన్తే మతమోద్వారై స్త్రిభిర్నతః
ఆచరిత్యాత్మనః శ్రీమస్తతో మాతిపరాంగతియో

(గీత 16-22)

అని ప్రమాణం చేశాడు. పాశవిక గుణాల నుండి విముక్తి పొందిన మానవునకు గురువు అన్ని విధాలా సహాయం చేస్తాడు. గురు ర్బ్రహ్మ, గురుర్విష్ణు గురుదేవో మహేశ్వరః గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః (గురు గీత)

గురువు బ్రహ్మవలెమనలో జ్ఞాన బీజాన్ని నాటి (సృష్టి చి) విష్ణువవలె ఆ జ్ఞానాన్ని పోషించి నేను జ్ఞానినని అహంకరించ కుండా ఆ అహంభావానికి లయకారుడై మనలో అహాన్ని చంపే రుద్రుడై బ్రహ్మ విష్ణు, మహేశ్వర స్థితిని మించి సాక్షాత్పర బ్రహ్మగా మిగులుతాడు. మనలో లోపాల్ని మన గురువే మనకు చూపెడుతాడు. గురువు మనలో ఆత్మ ఏది అనాత్మ ఏది అనే విషయాన్ని గురించి ఆత్మానాత్మా వివేకమును కలిగి స్తాడు. శిల్పి ఒక రాతిలో రాముణ్ణి మలచాలంటే ముందు రాముడు కాని పదార్థాన్ని ఉలితో మెల్లగా తీసివేయటానిక్ర ప్రయటానికి ప్రయత్నిస్తాడు, రాముడు కాని రాయి పొడియై రాలిపోతుంది. రాముడు రాతిలో నిలబడతాడు. శిల్పి యిప్పుడు రాముణ్ణి ఎక్కడ నుంచో తెచ్చిపెట్టలేదు. రాతిలోని రాముడిని ముందు తాను చూచి రాముడు కానిదానినితీసివేశాడు అంతే. అలాగే గురుపు అనాత్మను తొలగిస్తే ఆత్మ అందులోనే ఉంటుంది. అనాత్మను తొలగించుటయే గురువు చేసేపని. ఆత్మకాని పదార్థము జడము. ఆత్మ చైతన్యము అవాఙ్మానస గోచరము. అట్టి జడమును ఆత్మ నుండి వేరుచేసి ఆత్మ లక్షణములను తెలియజేసి మనలోనున్న ఆత్మారాముణ్ణి గురువు మేల్కొల్పుతాడు.

సాధారణంగా లోకంలో చిన్న చిన్న కోరికలకు చిన్న బలులను పెద్ద పెద్ద కోరికలకు పెద్ద పెద్ద బలులను ఇవ్వటం అలవాటు. ఆత్మారాముడిని తెలుసుకోవాలనే పెద్ద కోరిక మనకుంటే మనం నరబలి యివ్వాలి. సాధారణంగా పెద ప్రయోజనం ఆశించినపుడే నరబలులిస్తారు. సామాన్య మానవ దృక్పధాన్ని బలి యివ్వటమే నరబలి అవుతుంది. సామాన్య మానవ దృక్పధమంటే ఏమో విచారిద్దాము.

ఒకప్పుడు అష్టావక్రుడను మహాజ్ఞాని జనకుని సభలోనికి వచ్చారుట. దేహమంతా ఎనుమిది వంకరులతో నున్న ఆయనను చూచి సభలోని వారు ఫక్కున నవ్వారట. జనకునితో ఆ మహర్షి జనకా! ఇంతమంది చర్మకారులను సభలో ఎందుకు కూర్చోబెట్టుకున్నావు? అని ప్రశ్నించాడట. జనకమహారాజుకు భయము. ఆశ్చర్యము కలిగిపోయట. తన సభలో నున్న వారందరు మహా తపస్సంపన్నులు. అట్టివారిని చర్మకారు లన్నందుకు వారు కోపింతురని భయం వేసింది. ఆ మాటలు అష్టావక్రుడనటం వలన ఆశ్చర్యము వేసింది. దిగ్భ్రమతో జనకుడు మాట్లాడక పోవటం చూచి అష్టావక్రుడు "కటిక వానికి మాంసం మీద, కర్షకుడికి ఆవు యిచ్చే పాలమీద చర్మ కారునికి చర్మం మీద ఒక జంతువును చూడగానే ఆలొచన వస్తుందట. నా చర్మాన్ని చూచి వారికి నవ్వు వచ్చేను కదా. చర్మదృష్టి కలవారు చర్మకారులు కాక మరేమగుదురు? అని ప్రశ్నించేను. తమ అజ్ఞానానికి, ఋషులందరు చింతించి

అష్టావక్రునకు నమస్కరించిరి. ఈ కథననుసరించి మనమే వ్యక్తిని చూచినా అతని హోదా అతని సంపద అతని గుణాలు గుర్తుకు రావటం సామాన్య మానవ దృక్పథం. ఆ గుణాలు తెలియబడకుండా అతని తా న్నఆత్మతత్వంతెలుసుకొవాలంటే మనలో నున్న ఈ మానవ దృక్పథాన్ని అతిమాన వదృక్పథం కోసము (మాధవ) లక్ష్మీదేవికి నరబలి ఇవ్వాలి.

సినీ నటులు వస్తున్నారంటే జనం ఎగబడతారు. అదే పీఠాధిపతులు వచ్చారంటే చాలా కొద్దిమందే వస్తారు. కారణం సినీ నటులలో వారి చర్మాన్ని చూచే జనం ఆనందపడు తునా రు. పీఠాధిపతులలో ఆత్మతత్వము గ్రహించటం వీరికి చేతకాలేదు. అందుచే అక్కడికెవరూరారు. తనకు తోచక పోవటం- ఒకరు చెబితే వినకపోవటం తానే అందరి కంటే గొప్పవాడనను కోవటం సామాన్య మానవ లక్షణాలు. ఆ లక్షణాలను దేవికి బలి యిస్తే తరువాత మనకుకూడా తోస్తుంది ఇతరులు చెప్పగానే అర్ధమవుతుంది. ప్రపంచంలో ఎందరో మహానుభావులు ఉన్నారు. ఆ అందరిలో మన గొప్పతనమెంత అనే భావము పెరుగుతుంది. అట్టివారినే దైవజ్ఞులు అంటారు. అనగా తనలో నున్న మానవత్వాన్ని పోగొట్టుకొని దైవత్వాన్ని గ్రహించినవాడు అని అర్ధము మామూలు వాని అనుభవాలకు దైవజ్ఞుని అనుభవాలు వ్యతిరేకాలు. అందరూ తమస్సులో రాత్రి నిద్రపోతూ ఉంటే అతడు వంటరిగా ఆత్మ విచారణ చేస్తూ వుంటాడు. అందరికీ రాత్రి అయితే అతనికి పగలు

అందరు పగలు భౌతిక సుఖ నిమగ్నులై ఆరాటపడుతుంటే దైవజ్ఞుడు వాటిని స్వప్నతుల్యంగా చూస్తాడు. ఏ భౌతిక సుఖాలు మానవునకు సుముఖాలో అవి దైవజ్ఞునకు నిర్లక్ష్యములు ఉదాసీనములు. దీనినే గీతలో

యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సానిశా పశ్యతోమునేః

(గీత 2-69)

గీతాచార్యుడన్నాడు.

ప్రతివాడు నేచస్తే నావాళ్ళకెట్లా అంటాడు. నాకెట్లా అనడు కదా. ధనేషణ, ధారేషణ, పుత్రేషణ అను ఈ షణ త్రయాలకు తన సమయాన్ని వ్యర్థం చేస్తాడు. తనకోరకు క్షణకాలం కూడ వినియోగించటం లేదు కదా. గాలిలో మేడలు కట్టడం, భౌతిక సంపదను పెంచుకొన చూడటం స్థూల దృష్టి. స్థూల దృష్టిని ధ్వంసం చేసి సూక్ష్మ దృష్టిని పెంచుకోవటమే అధ్యాత్మిక మార్గంలో ముందంజ వేయటం మనకు సౌభాగ్యవంతమైన జీవితాన్ని ప్రసాదించటానికే అవర ణను తొలగించటానికి ఆవిర్భవించిన మాయయే లక్ష్మీదేవి. ప్రతి మానవుడు సుఖంగా జీవించాలనే కోరుకుంటాడు. కాని ఆ సుఖం ఎక్కడుందో ఎలా పొందాలో తెలుసుకోలేడు. పెసర చేలో ఉంగరం పారవేసుకొని పప్పులో వెదికితే దొరుకుతుందా?

ఇంటిలో సూది పడవేసుకొని వీధిలో లైటు పెద్దగా ఉందికదా అని ఆ లైటు క్రింద వెదికితే సూది లభిస్తుందా? ఆనందాన్ని తనలో దాచుకొని విస్మృతి చెంది ఆనందం కోసము బాహ్యం లో వెదకితే లభ్యమౌతుందా? అట్టి ఆనందాన్ని తెలియచేయ టానికి ఆవరణ మాయ అయిన లక్ష్మిని మనం ఆరాధించాలి. సుఖమైన జీవితానికి శక్తి ఉపాసన చేయాలి. ఆ శక్తి మహా కాళీ, మహాలక్ష్మి, మహాసరస్వతి రూపాల్లో ఆవిర్భవించిందని పెద్దలు చెబుతారు. లక్ష్మి అనగానే బంగారమో, ధనమో మనకు గుర్తు వస్తుంది. కాని మహాలక్ష్మి అష్టాంగ రూపాల్లో ఆవిర్భవించింది. జీవరాశికి అన్నం ప్రాణాధారము. ఒకప్పుడు అస్తిగత ప్రాణులుండేవారు. ధధీచి మహర్షి అస్తగత ప్రాణియే ఎముకలున్నంత వరకు వారిలో ప్రాణముం టుంది. దధీచి మహర్షి ఎముకయే ఇంద్రుడి వజ్రాయుధమ యింది. ప్రస్తుతం కలియుగంలో మానవుడు ఆహారం లేకపోతే జీవించలేడు. లక్ష్మీదేవి మాతృమూర్తిగా, అన్నపూర్ణగా, ధాన్య లక్ష్మిగా ఆవిర్భవించి ప్రాణులను పోషిస్తుంది. కర్ష కునిచే సంక్రాంతి రోజున పూజింపబడే ఆతల్లిని ధాన్యలక్ష్మి అంటాము. దేశ విదేశ వ్యవహారాల్లో ఐశ్వర్యం అవశ్యం. కాలము ధనమే, మాట ధనమే, వస్తువు ధనమే, నాణెము లొక్కటే ధనముకాదు. సమస్త వస్తు సముదాయమ్ము, లోహ ములు వెండి, బంగారమే కాదు. తుదకు ఇనుము కూడా ధనలక్ష్మి స్వరూపమే. శక్తి ఇచ్చుట ధనలక్ష్మిగా వ్యవహ రిస్తుంది. ధన దాన్యాలు కాపాడుకోవటానికి శత్రు భారం నుండి రక్షించుకోవటానికి ధైర్యం అవసరం అట్టి ధైర్యం లేకపోతే మన మేపని చేయులేము. ఒకపుడు

ండు ప్రహ్లాదుని శక్తిని ధారపోయమని అడుగుతాడు. హుడు దారపోయగానే అతనిలోని శక్తులన్ని ఇంద్రుడికి మించాయి. ధైర్యలక్ష్మి కూడ ఇంద్రునిలో చేరబోవు ో ప్రహ్లాదుడు ఆమెను అడ్డగిస్తాడు. అమ్మా! నీవున్నావనే ంతోనే అన్నిటిని దారపోశాను. నీవు నన్ను వదలి వెళ ్మ అనగానే అతని ప్రార్థనను మన్నించి ధైర్యలక్ష్మి ోనే వసించింది. ధైర్యం లేకపోతే తాము ఇంద్రుని ండమని మిగిలిన శక్తులన్ని ప్రహ్లాదుని లోనికి తిరిగి ేరాయి. దీనిని బట్టి అన్నింటిలోనికి ధైర్యలక్ష్మి ముఖ్య తెలియుచున్నది. జీవిస్తె రాజ్యాన్ని ఏలుతాము మరణిస్తే ి పోతాము అంతేకాని జీవచ్ఛవాల్లా బ్రతికి ఉండ కూడ భావాన్ని ధైర్యలక్ష్మియే కలిగించగలదు. మన భారతీయ ృతి చాలా గొప్పది. మన ప్రాచీలు

గోడి బిళ్ళ సొగసులో రిపు శిరస్సుల బంతులాట నేర్పు
చెణ్ణాడివుప్ప తెచ్చిన నాడే శాత్రవ వ్యూహముల భేధించు
నేర్పు కోతి కొమ్మచ్చి సొగసులో కెటలెగబ్రాకు నేర్పిరి
తనము సంపాదించిరి.

శౌర్యరసమును పిండి ఉగ్గుపాలతో రంగరించి బొడ్డు
ు పసికూనకే నాటి తల్లులు పోసిరిని శ్రీ విశ్వనాధ
ారాయణ గారు 'అంధ్రప్రశస్తి' అను తమ గ్రంథములో
ుల ధైర్య సాహసమును గురించి పలికిరి. అట్టి ధైర్యలక్ష్మి
నలో పెంపొందించుకొనుట అత్యావసరము.

సుఖమైన జీవితము గడపాలంటే సాంకేతిక విద్యలను అభ్యసించాలి. సర్వకళలు, సంగీతము, చిత్రలేఖనము, నృత్యము, శిల్పము (చతుష్షష్టి కళలు) విద్యాలక్ష్మి స్వరూప ములే. మానవుడు అన్ని రంగాల్లో విజయాన్ని సాధించాలంటే విజయలక్ష్మిని సేవించాలి. బల పరాక్రమాల కోసము వీర్య లక్ష్మిని కొలవాలి. చాలామందికి అనేక విషయాలు తెలుసు కాని పరాక్రమలక్ష్మి లోపించడం వలన తను మనో గతాభి ప్రాయాలను వ్యక్తం చేయలేరు. అక్రమాన్ని అణచి వేయ లని అన్యాయాన్ని ఎదురించాలని అందరికీ ఉంటుంది. కాని ఆ పని చేయలేరు. వీర్యలక్ష్మిని సంపాదించుకుంటే ఈ ప్రపంచంలో అక్రమాన్ని ఎదిరించటానికి వీలౌతుంది. పరి పాలనా సౌలభ్యం కోసము గజలక్ష్మిని ఉపాసించాలి. రాజ కీయ పరిజ్ఞానం లేని సామాన్యులను ప్రజలెన్నుకుంటారు. పరిపాలనాదక్షత లోపించకుండా గజలక్ష్మి ఉపాసన చేస్తె వారికి అట్టి శక్తి లభ్యమౌతుంది.

మన సమాజములో బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రు లని నాల్గువర్ణాలుగా ఉన్నారు. చాలామంది భగవంతునికి పక్షపాతమా కొందరిని బ్రాహ్మణులుగాను, మరికొందరిని క్షత్రియులుగా, వైశ్యశూద్రులుగా ఏల సృష్టించవలెను. అని ప్రశ్నిస్తారు. దానికి గీతాచార్యుడు

చాతుర్వర్ణ్యం మాయాసృష్టం గుణకర్మ విభాగశః
తస్యకార్తార మపిమాం విద్ధ్యకర్తామవ్యయమ్
(గీత 4-13)

మానవులను గుణములను, వారుచేయు కర్మలను అనుసరించి బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాల్గు జాతులను తానే సృష్టించితినని తాను మాత్రము అకర్తనని అవ్యయుడనని పలికెను. అంతరింద్రియ, బహిరింద్రియ నిగ్రహము గలవారు బ్రాహ్మణులని, తేజస్సు, ప్రతాపము, శౌర్యము. పరాక్రమము కలవారు క్షత్రియులని, భుజబలాన్ని ప్రదర్శించి జాతిని రక్షించుట వీరి పనియని ఇతర దేశములకు వలసిన సరుకులను ఎగుమతి చేయుట మన దేశమునకు కావలసిన వానిని దిగుమతి చేసుకొనుట, మాట చాతుర్యంకలిగియుండుట, వస్తువెట్టిదైనను దానిని అమ్మగలిగిన నేర్పు గల్గియుండుట మున్నగు గుణములు కలవారిని వైశ్యులుగను దేహపరిశ్రమయే ప్రధానముగా గలిగి జాతికి జీవనాధారమై ఆహారదాన్యములనుత్పత్తి చెసి జాతికి సేవచేయు స్వభావము కలవారిని మానసికమైన ధ్యానాదులు తెలియక కాయకష్టంతో సమాజరూప ఈశ్వరుని తృప్తి పరచడానికి పూనుకున్నవానిని శూద్రుడని నిర్ణయించారు. కాని ఆకాలంలో మానవునకు ఉత్తమమైన గుణముల నలవరుచుకొని ఉన్నతమైన కులంలో ప్రమోషన్ పొందటానికి అవకాశముండేది. విశ్వామిత్రుడు కులముచేత క్షత్రియుడు తపోబలముచేత రాజర్షియై మహర్షియై తుదకు బ్రహ్మర్షియైనాడు. సత్యకాము జాబాలి మహర్షి, ఆయన తల్లిజాబాలి పరిచారికగా ఎంతోమందికి సేవచేస్తున్నఒక శూద్రస్త్రీ ఆమె తన కుమారుని విద్యార్జనకై పంపగా గురువు అతని కులగోత్రాలను గురించి అడుగుతాడు. సత్యకాముడు

ఇంటికి వచ్చి అమ్మా! మనకులమేది? నేనే గోత్రమునకు చెందిన వాడను? అని ప్రశ్నించగా తల్లి నాయనా! నేను పరిచారికగా పలువురిని సంతోషింపచేయుదును. నీ తండ్రి యెవరోనాకే సరిగా తెలియదు. నావృత్తి(వేశ్యావృత్తి) ధర్మంలో ఆ విషయమును పట్టించుకొన వలసిన అవసరం లేదు. నా పేరు జాబాలి. నీవు నాకుమారుడవు అని మాత్రము చెప్పుము. అని పలికెను. సత్యకాముడు తల్లి చెప్పిన విషయమునే గురువుకు తెలియచేసెను. అసత్యాన్ని అంత ధైర్యంగా చెప్ప గలిగిన మనస్తత్వం కలవాడు బ్రాహ్మణుడేనని అతని నుపవీతునిచేసి బ్రహ్మ విద్యను బోధించాడు గురువు. పెద్దవాడై సత్యకాముడు జాబాలి మహర్షి అను పేరుతో ప్రఖ్యాతిచెందెను. ఈ గాథనాధారముగ నాటి వర్ణ వ్యవస్థలో ఒక వర్ణము నుండి వేరొకవర్ణములోనికిమారుటకు అవకాశమునట్లు తెలియుచున్నది రామాయణం కూడా ప్రచేతసుని కుమారునిచే వ్రాయబడినట్లు తెలియుచున్నది.

"వేదః ప్రాచేతసాదాసీత్" అని రామాయణంలో కలదు. వాల్మీకి మహర్షి ప్రచేతసుని కుమారుడని స్పష్టమగుచున్నది. ఒకచోట రామాయణంలో వాల్మీకి రామునితో "ప్రాచేతసోదశ మోహం పుత్రా రాఘవనందనః అన్నారు. ప్రచేతసుడను బ్రాహ్మణుని పడవ పుత్రుడు అడవిలో బోయవాడుగా ఎందుకు జీవించవలసి వచ్చినది. అని యోచిస్తే బ్రాహ్మణ లక్షణాలు లేని వారిని తక్కువ జాతులలోనికి పంపివేయుట కూడ నాటి

ఆచారమని తెలియుచున్నది. తరువాత వాల్మీకి నారద ప్రేరితుడై రామాయణ మహా కావ్యాన్ని వ్రాసి మహర్షియైన సంగతి జగద్విదితమే. మనము కూడా జన్మానా విప్రులం కాకపోయినా కర్మణా విప్రులము కావటానికి ప్రయత్నించవచ్చు. ఎలాగైనా బ్రాహ్మణుని భ్రష్టాచారుని చేయుటకంటె మిగిలిన వాళ్ళు ఉన్నత భావాలు అలవరుచుకొని బ్రాహ్మణులు కావటానికి ప్రయత్నిస్తే సమాజమే బాగుపడుతుంది కదా. బ్రహ్మజ్ఞానము కలవాడు బ్రాహ్మణుడని అట్టి బ్రహ్మజ్ఞానము సంపాదించుకోవాలంటే శక్తి ఉపాసన చేయాలని తండ్రి యెవరో తెలుసుకోవాలంటే తల్లినే కదా అడగాలి. అందుచే నాలుగు జాతుల వారిలో బ్రాహ్మణులు ఆషాఢ పూర్ణిమనాడు విద్యాదేవిగా శక్తిని సరస్వతీదేవి రూపంగా ఉపాసిస్తారు. క్షత్రియులు నవరాత్రులలో ఖడ్గము మున్నగు ఆయుధాలకు పూజచేసి శక్తిని పూజిస్తారు. వైశ్యులు దీపావళి రోజున ధనరాశిని శక్తిరూపంగా పూజిస్తారు. శూద్రులు సంక్రాంతి రోజున ధాన్యలక్ష్మి రూపంగా ఆరాధిస్తారు. ఇలా కొంతకాలము ఉపాసించిటంవలన ఆయా సౌభాగ్యాలను అతడు పొందుతాడు. లక్ష్మీదేవి విద్యామాయగా అవిద్యామాయగా ఉండి లౌకిక సుఖాలయెడ కొంతకాలానికి విరక్తి కలిగేటట్లు చేస్తుంది. అది లేనందు వలన విరక్తి లేకుండా లౌకిక సుఖాలు క్షణికాలని తెలుసుకోనే జ్ఞానాన్ని ప్రసాధిస్తుంది. శాశ్వత తత్వం మీదికి దృష్టిమళ్ళి సూక్ష్మతను ఉపాసించటం నేర్చుకుంటాడు. లక్ష్మీదేవి భౌతిక సుఖాలు

ప్రసాదించినప్పుడు ఆమె అవిద్యామాయ అవుతుంది. ఆత్మ సుఖాన్ని కలిగించినపుడు విద్యామాయ అవుతుంది. ఎప్పుడైతే మనలో అవిద్యామాయ నశించి విద్యామాయ ఆవిర్భవించిదో లౌకికమైన సుఖాలు మనకు వెగుటు కలిగిస్తాయి. భౌతిక సంపద లెన్నియున్నా వాటితో మనస్సు తృప్తి చెందక మరేదో కావాలని తనకు కావలసినదేదో తెలియతేదని ఆరాటం కలిగితే మనలో అవిద్యామాయ ఆవిర్భవించిందని తెలుసుకోవాలి. లక్ష్మి దేవి సకల విధములైన సౌభాగ్యములను ఇచ్చి పోషిస్తుంది అనటానికి అమెను చిత్రకారుడు అనేకమైన నగలతో అలంకరిస్తాడు లక్ష్మిదేవి వికసించిన పద్మంలో కూర్చుని ఉంటుంది ఆమె చేతిలో వికసించిన పద్మాలు మనకు కనిపిస్తాయి. మనలో విద్యామాయ ఆవిర్భవించగానే ఇంతకు ముందు మనం చెప్పుకున్న షట్చ్రకాలలోని పద్మాలు (విశుద్ధ, అనాహత. మణిపూరక, స్వాధిష్ఠాన, మూలధార, ఆజ్ఞా) ముకుళించుకొని ఉంటాయి. ఇప్పుడవి వికసిస్తాయి. వికసించిన జ్ఞానానికి వికసించిన పద్మాలు ప్రతీకలు. దుర్గామాతగా యుద్ధాలు భూకంపాలు సృష్టించిన ఆ తల్లే ఆరోగ్యరూపంగా సంఘశ్రేయో రూపంగా విశ్వశాంతి, లోకకళ్యాణ దాయినిగా అవతరిస్తుంది. లక్ష్మి సౌభాగ్యవంతమైన లక్ష్మిని సంక్షేమశాఖ, ఆరోగ్యశాఖ యందు, ఔషధాలయములందు (రిసెర్చ్ సెంటర్), అగ్నిమాపక శాఖ, రక్షణశాఖ, విద్యాశాఖలందు చూడవచ్చు. లక్ష్మిదేవి నాలుగు చేతులలో ఈ శాఖలను పోషిస్తుంటుంది. విష్ణుశక్తియే లక్ష్మిగా అవతరించి మానవాళి శ్రేయోసౌభాగ్యాలను

కాపాడుతుంది. ఏ దేశంలో ఆరోగ్య అగ్నిమాపక, రక్షణ, విద్యాశాఖలు నిర్లక్ష్యం చేయబడతాయో ఆదేశ ప్రగతి కుంటు బడుతుంది అని పాలకులు తెలుసుకోవాలి. మందిరాలు, ఉద్యానవనలు, సరస్సులు, విద్యాలయాలు, ఆటస్థలాలులక్ష్మి నిలయాలు. ప్రతి గ్రామంలో చిన్న చెట్టు క్రిందనైనా గ్రామ దేవత రూపంలో లక్ష్మిని ఆరాధిస్తారు. ఏ గ్రామంలో దేవాలయం ఉండదో, జనులకు, గోవులకు త్రాగేనీరు ఉండదో అది లక్ష్మి లేని గ్రామం. అట్టి గ్రామంలో మహాత్ములు వసించరు.

భౌద్ధమతం వ్యాప్తి చెందిన కాలంలో ఈ భౌతిక జగత్తంతా మిధ్యయని వేరే ఏదో ఎక్కడో ఉందని దాన్ని తెలుసు కోవటానికి ప్రయత్నం చేయాలని లౌకికమైన సుఖాలను విడనాడాలని బోధ చేశారు. అశోకుడు కళింగ యుద్ధంలో రక్త పాతాన్ని చూచి మనస్సు మార్చుకొని రాజ్య కాంక్షను విడచి భౌద్ధ భిక్షువైన సంగతి చరిత్ర చెబుతుంది. బలపరాక్రమాలను ఉపయోగించుకోకుండా శత్రువులు దండెత్తి వచ్చిన శాంతి పేరుతో రాజులు మౌనం వహించారు. జాతి నిర్వీర్యం అయ్యింది. మాతృదేవత అయిన రాజ్యలక్ష్మి రక్షణను అశ్రద్ధ చేశారు. రాజ్యం శత్రువుల హస్తగతమైనది. అందుచే లక్ష్మి భారత దేశానికి వదలిపెట్టింది. లక్ష్మిని నిర్లక్ష్యంచేసి తామసం అంకురించటం వలన దేశాన్ని రెండు శతాబ్దాల కాలము

జానిసత్వము లభించింది. కర్తవ్య మూఢులైన మనకు మన ప్రాచీన ఋషులు కర్తవ్యబోధ చేశారు. లక్ష్మి ఉపాసన అంటే కర్తవ్య నిర్వహణయే. ముక్కు మూసుకొని కూర్చోవటం కాదు. కర్మ చేయాలి. ఫలం ఆశించరాదు. నీ దేశాన్ని జాతిని రక్షించటం నీ కర్తవ్యము.

"కర్మణ్యేవాధి కారస్తే మాఫలేషు కదాచన
మాకర్మ ఫలహేతు ర్భూర్మాతే సఙ్గో స్త్వ కర్మణి

(12-4)

అని గీతాచార్యుడు కర్మ చేయమని ఒకప్పుడు కూడ ఫలం ఆశించ వలదని బోధ చేశాడు. పనిచేయటం మాత్రము నావంతు. దానికి ఏ ఫల మివ్వాలో అది భగవన్నిర్ణయము. అని ధైర్యంగా కర్మ చేయుటమే. అడిగినవాని కంటే అడగ కుండా ఉన్నవానికే మనము ఎక్కువ ముట్టచెబుతాం కదా. జాతిని రక్షించకుండా కర్తవ్యమూఢులై మన రాజ్యలక్ష్మిని పర హస్తగతం చేశారు కొందరు. తిరిగి ఆమెను సంపాదించు కోవటానికి ఎన్ని కష్టాలు పడ్డామో ఏ స్వాతంత్ర్య యోధుని అడిగినా చెబుతాడు. ఒకప్పుడు నారద మహర్షి అడవిలో పోవుచుండగా ఒక పాము కాటు వేయవచ్చినదట. నారదుడు తత్వం బోధించి జనులకు హాని కలిగించటం మహా పాపమని రామనామ జపం చేసుకుంటూ ఉండమని చెప్పి వెళ్ళాడట.

ఆ పాము అలాగే మంత్రజపం చేస్తూ ఉండట. చుట్టుప్రక్కల కొందరు మనుష్యులు పాము కాటువేయని మనస్తత్వాన్ని గ్రహించలేక రాళ్ళతో దాన్ని కొట్టటం మొదలు పెట్టారు. దాని ఒళ్ళంతా గాయాలతో చితికి బాధతో తిరిగి నారద మహర్షి వచ్చినప్పుడు కనిపించింది. దాని దైన్యస్థితికి కారణమడిగాడు నారదుడు ''మీరు చెప్పినట్లుగా నేనెవరినీ కాటువేయుట లేదు. వారందరు రాళ్ళతో కొట్టినా ఓర్పుతో ఊరుకున్నానే'' చెప్పిందట. నారదుడు సర్పరాజా! కాటువేయవలదన్నానే కాని బుస కొట్టవలదన్నానా? బుసకొట్టి ఆత్మరక్షణ చేసుకోకూడదని నేను చెప్పలేదు కదా. నిన్ను నీవు రక్షించుకోవటం ప్రథమ కర్తవ్యము అని చెప్పాడు. ఒక కాలంలో ఆధ్యాత్మిక మార్గంలో నడుస్తున్నామనుకుంటూ దేశ రక్షణ విషయంలో అశ్రద్ధ వహించి లక్ష్మీదేవిని నిర్లక్ష్యం చేశారు. ఆధ్యాత్మిక మార్గం వేరే లేదని. కనిపిస్తున్న జగత్తునంతా బ్రహ్మమయంగా చూడటమేనని తెలుసుకోలేక పోవటం వలన జాతి రక్షణపట్ల నిర్లక్ష్యం వహించారు. ఈ జగత్తంతా భగవంతుని ఆస్తి. ఇందులో ఏ శాఖలో పనిచేస్తున్నా మనమాయన దగ్గర పని చేస్తున్నట్లే. ఆధ్యాత్మిక స్థాయిలో ఉన్నత దశకు చేరుకున్నామంటూ సాధారణ కర్తవ్యాన్ని విస్మరించటం మంచిది కాదు. మనం చేస్తున్న పనియందు నిర్లక్ష్యవైఖరి వహించి దేవాలయ నిర్మాణానికి నిధులు వసూలు చేస్తానంటే అది దైవ కార్యమనిపించుకోదు. గీతలో మొదటి శ్లోకాన్ని అహల్యాబాయి

హాల్కారు ఋలా అర్థము చేసుకొని అన్వయము చేసుకున్నారు. ధర్మక్షేత్రే, కురుక్షేత్రే అను శ్లోకాన్ని "క్షేత్రే క్షేత్రే ధర్మం కురు అని గీత ప్రబోధిస్తున్నది అనుకున్నారు. మనమే రంగంలో ఉన్నామో ఆ రంగంలో కార్యాన్ని సక్రమంగా నెరవేర్చటమే దైవకార్యమౌతుంది. ప్రతిఫలాన్ని కోరకుండా ప్రాప్తించిన దానితో తృప్తి జెంది మన కర్తవ్యాన్ని నెరవేరుస్తూ దైవకార్యాం చేస్తున్నట్లు భావించాలి. అట్టి భక్తుని భగవంతుడు తప్పక అనుగ్రహిస్తాడు.

ఒకప్పుడు నారదుడు శ్రీకృష్ణుని మందిరానికి వెళ్ళాడు. కృష్ణుడొక భరిణెలో కొంత ఇసుకను పెట్టి పూజించటం నారదుడు చూచాడు. అదేమిటని ప్రశ్నించాడు. అది తన భక్తుల పాదధూళి అన్నాడు కృష్ణుడు నారదునకు తాను కాకుండా మరెవరో భక్తులున్నారనికృష్ణునడం భాధకలిగించిది. ఆ విషయం భగవానుడు పసిగట్టాడు. "నారాదా! ఓ చిన్న గిన్నెలో నూనె నిస్తాను. ఒక బొట్టు జారకుండా భూలోక పర్యటన చేసిరమ్మనాడు. సరియని నారదుడానూనె గిన్నెను తలపై పెట్టుకొని భూలోక పర్యటన చేసి వచ్చాడు. ఆ సమయంలో తన నామాన్ని అతడెన్ని సార్లు జపించాడనీ ప్రశ్నించాడు కృష్ణుడు. దానికి నారదుడు మహాప్రభూ నూనె బొట్టు క్రింద జారకుండా దృష్టి అంతా దానిమిద కేంద్రీకరించ డానికే సరిపోయింది. ఇక నామస్మరణకు కూడా అన్నాడు. ఒక చిన్న నూనె గిన్నె నీకిస్తే నామస్మరణమునకు సమయము దొరకలేదే ఇంత పెద్ద సంసారమును నెత్తిన పెట్టుకొన్న

సామాన్య మానవుడు నా నామస్మరణ ఎలా చేయగలడు. అందుచే నారదా మానవుడు తాను చేసే ప్రతి పనిని నా కార్యం గా చేస్తే చాలు. అతడు నా భక్తుడే అన్నాడట. చాకలి బట్టలు ఉతుకుతూ, పనిమనిషి అంట్లు తోముతూ. ఉపాధ్యాయుడు పాఠం చెబుతూ, రైతు పొలం దున్నుతూ, కార్మికుడు కర్మాగారాలలో పనిచేస్తూ ఆయా పనులన్నీ భగవత్కార్యాలుగా చేస్తే చాలు. చివరకు అన్నం తింటూకూడ తినేది మనమే అయినా దాన్ని భగవత్కార్యంగా చేయవచ్చు. ఆహారాన్ని తీసుకుంటూ నాలో నున్న వైశ్వానరుడికి హోమ ద్రవ్యంగా ఈ ఆహారాన్ని సమర్పిస్తున్నాను.

బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్
బ్రహ్మైవతేన గంతవ్యం బ్రహ్మ కర్మ సమాధినా

(గీత-4-24)

అట్టి భావనతో ఆహారాన్ని తీసుకుంటే అది భగవత్కార్యమే అవుతుంది. భగవంతుడీవాడు నాకీ కర్మ చేయమని నియోగించ్చాడు. నేను కేవలం ఉపకరణాన్ని మాత్రమే ఈ కర్మ చేసేవాడు చేయించేవాడు కర్మ ఫలాన్ని అనుభవించేవాడు అన్నీ ఆయనే అని అనుకొని కర్మ చేయాలి. అదే నిజమైన ఉపాసన అవుతుంది. నేను గుళ్ళో పూజ చేయాలి, ఇంట్లో ధ్యానం చేయాలి అని ఆఫీసు పని నెగరగొట్టి చేస్తే దాని వలన ఫలితము ఉండదు. చేసే పనిని సక్రమంగా నిర్వహించ...

నేను చేస్తున్నాననే అహానికి లోనుగాకుండా చేయటం చేస్తున్న దాన్ని దైవ కార్యంగా చేయటం, భగవన్నామాన్ని జపించటం. లక్ష్మి ఉపాసన అనిపించుకుంటుంది. దేహం నుండి దేహిని వేరుచేస్తేనే అనగా ఆత్మను అనాత్మ నుండి వేరు చేస్తేనే లక్ష్మి ఉపాసన సిద్ధిస్తుంది. దేహి దేహము ఒకటేనన్న భావమే లక్ష్మి ఉపాసనకు చోటివ్వదు. దేహము నుండి దేహిని వేరు చేసి దేహం కర్మ చేస్తుంది. దేహి పరమాత్మను గురించి యోచన చేస్తాడు అని నిర్ధారించుకోవాలి. నిన్ను నీవు తెలుసుకోవటమనేది ఒక ప్రక్రియ. సంసారంలో కర్తృత్వరహితంగా ఉండేది మరో ప్రక్రియ.

ఆకలితో బాధ పడేవానికి మతాన్ని గురించి బోధిస్తానని మంత్ర జపం చెయ్యమని అంటే వినడు. దానివలన ప్రయోజనం లేదు. అందుకే వాడికి కర్తవ్యబోధ చేయమంటాడు వివేకానందుడు. రామకృష్ణునిభావ గురువుగా, వివేకానందుని ఆదర్శంగా పెట్టుకొని లక్ష్మి యొక్క బహు రూపాన్ని విస్తృతం చేసే కర్తవ్య దీక్షకు పూనుకోవాలి. దేహి చేత ఆత్మ విచారణ చేయించటం దేహంచే పని చేయించటం అనేవే నేటి సమాజానికి అవసరమని వివేకానందుడు బోధించాడు.

లక్ష్మిని సరిగా అర్థం చేసుకోలేక ధనవంతులు అనేక దుర్వ్యసనాలకు ధనాన్ని ఉపయోగిస్తున్నారు. అది లక్ష్మిదేవికి బాధాకరమే కదా. అందుకే దుర్వ్యసనపరుని నాశనము

చేయుటానికి ఆమె పూనుకుంటుంది. ధనాన్ని అనవసరంగా ఖర్చుచేసి భౌతిక వాంఛలు పొందే వాడు ఆధ్యాత్మికంగా అధః పతితుడౌతాడు. అత్త వారింట్లో ఉన్న ఒక కోడలు గృహకృత్యాలు నెరవేరుస్తూ కూడ తనను పుట్టింటికి పిలుచు కుని వెళ్ళటానికి వచ్చే అన్నయ్యను గురించి ఎలాఆలోచిస్తుందో అలాగే అన్ని కర్మలు చేస్తూ భగవంతుని గురించి ఆలోచన చేయి అన్నారు. రామకృష్ణులు దాన్నే చిత్రకారులు లక్ష్మీదేవి విష్ణువు పాదాలు పత్తుతూ కూర్చునట్లు, విష్ణువు శేషపాన్పుపై పవళించి యోగ నిద్రలో ఉన్నట్లు చిత్రిస్తాడు. విష్ణువుకు సామాన్య మానవులవలె కాళ్ళు నొప్పులా? లక్ష్మీదేవి ఎల్లప్పుడు ఆయన పాదాలొత్తాల? అని ఆలోచిస్తే దాని అంతరార్థం మనకు బోధ పడుతుంది. అరిషడ్వర్గాలనే కోకలతో కబళించ టానికి సిద్ధంగా ఉన్న మానవ దేహంలో దేహి వాటినన్నిటిని అధీనం చెసుకొని ప్రశాంతంగా పవళించగలగాలి ధనము తన అధీనమైయుండాలి కాని, తాను ధనం చేతిలో బానిస కారాదు. కరెంటును, అణుశక్తిని మన అధీనంలో పెట్టుకొని ఉపయో గించుకుంటే అది విశ్వ కళ్యాణానికి కారణమౌతుంది. మనం బలహీనులమయితే మనకు మరణాయుధంగా పని చేస్తుంది. అలాగే ధనం మన చెతిలో ఉంటే పదిమందికి ఉపయోగపడుతుంది. ధనం చెతిలో మనముంటే మనల్ని కీలుబొమ్మలుగా చేసి ఆడిస్తుంది. అందుచే సారథియైన దేహి రథమైన దేహాన్ని తత్సంబంధమైన వాటిని అదుపులో పెట్టుకొని వ్యవహరించాలి దేహం ఏత కర్తవ్య నిర్వహణ చెయిస్తు దేహపోషణ చేయించాలి. దేహిత ఆత్మచే విచారణ

చేయించి ఆత్మానందాన్ని పొందేట్లు చేయాలి. అదే లక్ష్మీ ఉపాసన.

కత్తి మన చేతిలో ఉంటే దానితో పళ్ళు కోసుకోవచ్చు చేయికూడ కోసుకోవచ్చు. విద్యుచ్ఛక్తి, అణుశక్తులు లోక కళ్యాణానికి ఉపయోగించవచ్చు. విశ్వవిధ్వంసానికి కారణము కావచ్చు. అలాగే ధనాన్ని సద్వినియోగంచేస్తే లోకకళ్యాణం చేయవచ్చు అని విష్ణువు పాదాల దగ్గర లక్ష్మి నుంచుకొని మనకు బోధిస్తున్నాడు. కొందరు ధనవంతులు ధనమదాంధత్వంతో మానవ ధర్మాన్నికూడ విస్మరిస్తారు. మానవునకు సాటి మానవునిగా ప్రేమాభిమానం పంచి యివ్వటానికి మానవత అనిపించుకుంటుంది. ధనమివ్వకపోయినా ఎవరూ బాధ పడరు. ప్రేమగా మాట్లాడలేకపోతే మానిషి ధనం చేతిలో బానిస అయినట్లేలెక్క. ధనవంతుడలా ఎందుకుప్రవర్తిస్తాడో! ఇతరులతో మాట్లాడినంత మాత్రాన అతని ద్రవ్యాన్ని ఎవరూ తీసుకోరు కదా. తాను ధనవంతుడనని అలా ప్రత్యేకంగా ఉండటమే తన ధర్మమని అనుకునే వాడు ధనం చెతిలో బానిస. వివేక వైరాగ్యాల ద్వారా లక్ష్మినీ ప్రసన్నం చేసుకోవాలి.

భారత దేశంలో గృహాన్ని లక్ష్మీ నివాసం అంటారు. ఆ ఇంటి ఇల్లాలిని గృహలక్ష్మిగా గౌరవిస్తారు. పాశ్చాత్య దేశాల్లో స్త్రీ పురుషునితో సమభాగిని. భారత దేశంలో స్త్రీ ''యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః యత్రైతాస్తు న పూజ్యంతే

సర్వాస్తత్రా ఫలాపి క్రియః" అని పూజింప బడుతుంది. గృహమనే ఒక మందిరంలో మూర్తిగా పూజలందుకుంటూ నిర్విరామంగా తనవారి శ్రేయస్సు కొఱకు కృషిచేసే తల్లి లక్ష్మీ స్వరూపమే.

బాల్యే పితుర్వశౌ తిష్ఠే త్పాణి గ్రాహస్య యౌవనే
పుత్రాణాం భర్తరి ప్రేతే నస్త్రీ స్వతంత్రతామ్

(మనుధర్మశాస్త్రం 5-14-8)

పితారక్షతి కౌమారే భర్తారక్షితి యౌవనే
రక్షంతి వార్ధకే పుత్రాః నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి

(మను 9-3)

అని మనువు చెప్పిన దానిని అర్థం కాని కొందరు భారతదేశంలో స్త్రీకి స్వాతంత్ర్యం లేదంటారు. ఈ శ్లోకాన్ని సరిగ్గా అర్థం చేసుకుంటే స్త్రీకి స్వాతంత్ర్యముందో లేదో తెలుస్తుంది. మూర్థాభిషిక్తులైన వారికి అంగరక్షకులుంటారు. వారు స్వతంత్రంగా ఎక్కడికీ వెళ్ళటానికి వీల్లేదు. వారికే ప్రమాదము రాకుండా కంటికి రెప్పలా అంగరక్షకులు కాపాడుతుంటారు. అంగరక్షకులచే కాపాడబడేవారు వారికంటె అధికులే కదా. స్త్రీ కూడా గృహ సామ్రాజ్యానికి పట్టాభిషేకం చేశారు. అది ప్రేమాభిషేకం అందుచే బాల్యంలో తండ్రి,

యౌవనంలో భర్త వార్ధక్యంలో పుత్రుడు ఆమెను రక్షిస్తుంటారు పుట్టింటికి కీర్తి ప్రతిష్టలు తేవాలన తండ్రి కుమార్తెను అంగరక్షకుడిగా రక్షిస్తాడు.

కార్యేషుదాసి కరణేసు మంత్రీ భోజ్యేషు మాతా
రూపేచలక్ష్మి, శయనేషు రంభా క్షమయాధరిత్ర

షట్కర్మరూపేణ కులధర్మ పత్ని అని కులధర్మపత్నిని భర్త అంగరక్షకుడై సేవిస్తాడు. కుమారుడు తన వంశాధిక్యతను కుల మర్యాదను, ఇంటి గౌరవాన్ని భావితరాలవారి కందరికీ అందించు దివ్యమూర్తిగా తల్లిని సేవిస్తాడు. ఇలా అందరితో సేవింపబడే స్త్రీ గృహలక్ష్మి కాక మరేమవుతుంది. స్త్రీ లేకుంటే పురుషుడు శవప్రాయుడని శంకరుడు తన సౌందర్య లాహరిలో వివరించారు.

చితాభస్మ లేపో గరళ మశనమే దిక్పటధరో జటధారీ
కంఠభుజగ పతిహారీ పశుపతిః కపాలి భూతేశో
భజతి జగదేకైక పదలీం
భవానీం త్వాత్పాణి గ్రహణ పరిపాటీ ఫలమిదం సౌందర్య లహరి

పై శ్లోకార్థం ఒకసారి పరిశీలిద్దాము. శివుడు స్మశాన బూడదను వంటినిండా పూసుకుంటాడట. విషాన్ని ఆహారంగా

తింటాడు. దిగంబరుడు, తైల సంస్కారంలేని జటలు మెడలో పాముల దండలు, ఎద్దు వాహనము, చేతిలో పుర్రె, సేవకులు భూతములు, ఇవన్నీ శివలక్షణములా? (మంగళ కరములా?) శివమనగా మంగళం కదా! స్మశాన బూడిద పూసుకొనుట, దిగంబరుడుగ సుండుట, భూత గణములతో సేవింపబడుట. ఇవన్నీ శవలక్షణములు ఈలక్షణములుగలఆ శంకరుడుజగదీశ్వరుడెట్లయ్యేను?భవానిపాణిగ్రహణమువలననే సుమా! మంత్ర శాస్త్రంలో ఈకారం శక్తిబీజం. శవము 'ఈ' కారము చేరి శివమైనది. అనగా శక్తిచేరుట వలన శివుడైనాడు పుత్రికా రూపంలో, పత్నీ రూపంలో, తల్లి రూపంలో, స్త్రీని సేవించటము లక్ష్మి ఉపాసనే అవుతుంది. వివాహ సమయం లో ధర్మేచ, అర్థేచ, కామేచ త్వమేషానాతి చరితవ్యా అని కన్యాదాత పలుకగా పెండ్లికుమారుడు నాతిచరామి అని ప్రతిజ్ఞ చేస్తాడు. ధర్మార్థ కామములలో ఈమె మాట నతిక్రమించ నని ప్రమాణం చేస్తున్నాడు. కాని దౌర్భాగ్యవశాత్తు మన దేశంలో స్త్రీ పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలోపడి తనకిచ్చిన ఉత్కృష్టమైన స్థానాన్ని నిలుపుకోలేక పోతున్నది. మన దేశంలో స్త్రీకి పాతివ్రత్యం నమ్రత ఆభరణాలు, నేడు అంధ కూపంలో మునిగినకొందరుస్త్రీలు అందరిచేత ఆకర్షింపబడేటట్లు వస్త్రాలంకరణ చేసుకుంటున్నారు. సినిమాలలోకూడపురుషులు నిండుగా బట్టలు కట్టుకొని కనిపిస్తే స్త్రీ అర్ధనగ్నంగా అంగాంగ ప్రదర్శనలు చేస్తూఉన్నది. అట్టిఅలంకరణలవలననేస్త్రీ కాముక

దృష్టితో చూడబడుతున్నది. పాశ్చాత్యనాగరికతా వ్యామోహము వలన తనను తాను అగౌరవ పరుచుకొనేటట్లు చేసుకుంటున్నది ఆమె ఆ విషయాన్ని గమనించటం లేదు. కాముక దృష్టి నుండి మరలించుకోవాలంటే మన పెద్దలు నిరోధ సంస్కారాన్ని నేర్పారు. ఎప్పుడైనా స్త్రీని చూచినపుడు ఆమె సౌందర్యముచే మనస్సు ఆకర్షింపబడిన ఈ శరీరంలో నన్నాకర్షించినది మాంసమా? చర్మమా? ఎముకలా? అని విచారణ చేసుకొన వలెను. శరీరమంతా సప్తధాతువులతో నిర్మించబడినదే కదా. విడివిడిగా చూస్తె ఇందులో అందమేమున్నది. శంకరుడన్నట్లు "నారీస్తనభర నాభీ దేశం దృష్ట్వామాగా మోహావేశం ఏతన్మాంసవసాది వికారం మవిసి విచింతయ వారం వారా"

(భజగోవిందం-3)

అది మాంసపు ముద్దకదా అని విచారణ చేస్తె కాముక దృష్టి నుండి మరల్చు కోవచ్చు.

గతవతివాయౌ దేహాపాయౌ భార్యబిభ్యాతి తస్మిన్‌కాయె

(భజగోవిదం-6)

ఇక మన దేహమే ఈ ప్రాణవాయువు కాస్తా వెళ్ళిపోగానే ఆ దేహాన్ని చూచి ప్రియమైన వాళ్ళు కూడ భయపడతారు. అట్టి దేహాల మీద ఈ భ్రాంతి ఎందుకు? అని మరల మరల దోష విచారణ చేస్తే విషయ సంబంధ సంస్కార మెప్పుడు

కలిగినా దాని వెంట నిరోధ సంస్కారము కూడా కలిగి చిత్త వృత్తులణగును. చిత్తవృత్తి నమిస్తే లభించేది శమాధేకదా.

మనయేవమను ష్యాణం కారణం బంధ మోక్షమో

(అమృత బిందూప నిషత్తు-2)

అన్నట్లు ఏ మనస్సు ద్వారా తానీసంస్కారమున చిక్కుకున్నాడో ఆ మనస్సు ద్వారానే బంధ విముక్తుడు కాగలడు. ఒక చెట్టును కోట్టాలంటే వృక్ష జాతికి చెందినమరొకచెట్టుకొమ్మను గొడ్డలిలో దూర్చాలి కదా. అలాగే మనో నాశనం కావాలంటే మనస్సులోనే యోచన చేయవలసి వుంటుంది. లక్ష్మి ఉపాసన సక్రమంగా చేస్తే బంధ విమోచనమై మోక్షం పొందుతాము.

"యా దేవి సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా" ఏదేవి అన్ని భూతములలో మాతృ రూపిణియైన వసిస్తున్నదో అట్టి తల్లిని గ్రహించి ఆమె వలనే మనలను మనము సరిదిద్దుకొనుట నిజమైన లక్ష్మి ఉపాసన.

తల్లిని "అబ్రహ్మకీట జననీ" అని మరొక నామంతో పిలుస్తారు. బ్రహ్మ మొదలు కీటకము వరకు అందరూ ఆమె సంతతియేనట. ఎవరెవరి ప్రారబ్దాను సారము వారలా ఆయా కర్మలను చేస్తూ ఉంటారు. ఇక్కడ చాలామందికి సందేహం వస్తుంది. అందరూ భగవంతుని సంతానమే

అయితే కొందరు ధనవంతులుగా, మరికొందరు పేదవారుగా, కొందరు తెలివిగల వారుగా, కొందరు తెలివి తక్కువగా ఎందుకుంటారు. అన్న ప్రశ్న తప్పక ఉదయిస్తుంది. ఒకే భూమిలో ఒక అడుగు దూరములో ఉల్లిచెట్టు, మల్లె చెట్టు నాటితే ఉల్లి ఉల్లిపూవులే పూసుంది. మల్లె మల్లెపూవులే పూస్తుంది. ఉల్లి వాసన మల్లెకుగాని మల్లెవాసన ఉల్లికిగా ఎప్పుడును రాదు. ఆ రెండు ఒకే భూమిలో పుట్టాయి. ఒకే నీరు పోసుకున్నాయి. ఒకే వాతావరణంలో పెరిగాయి. ఆ రెండింటి వాసనలలో తేడా రావటానికి కారణమేమిటి? వాటి విత్తనాలలో అవ్యక్తంగా అవన్నీ దాగియున్నాయి. అలాగే ఒకే తల్లి సంతానమైననూ మన సంచిత వాసనల వలన మన జీవితాలు నడుస్తుంటాయి. ఒకే తల్లికి కలిగిన కొడుకులలో ఒకడు కలెక్టరు కావటం మరొకడు కండెక్టరు కావటం మనము చూస్తూనే ఉన్నాము కదా. భారతదేశ వాసులు ఈ కర్మ సిద్ధాంతాన్ని నమ్ముతారు గాబట్టి సంతృప్తికరమైన జీవితము గడుపగలుగు చున్నారు. వారు ప్రతిప్రాణిలో పరమాత్మను దర్శించగలరు. చిత్రకారుడు భావితరముల వారికి భగవత్తత్వాన్ని అందించుటం కోసము అనేక చిత్రాలు గీచాడు. కానీ దురదృష్టవశాత్తు వాటి నర్థం చేసుకోలేక ఆ చిత్రాలకే పూజలు చేయటం మొదలు పెట్టాము మనమిక్కడ అష్టభుజా దేవి విగ్రహాన్ని గురించి ఆలోచిద్దాము దేవి శుంభని శుంభులను చండముండాసురిని, మహిషాసురుడు మొదలైన వారిని సంహరించి శ్రీపురమును పరిపాలించినదట.

ఆమె పరిపాలనా సామర్థ్యమును ఆమె దక్షతను మనకు తెలియజేయటానికి అష్టభుజాదేవి విగ్రహాన్ని చిత్రీకరించారు.

మృగాలన్నింటిలోనికి క్రూరమైనది సింహము. అది బలశాలి. తన ప్రతాపముతో వనానికే అధిపతి అయినది. అట్టి మృగరాజును వశపరుచుకోవటమే కాకుండా దేవి దానిపై ఆరూఢయై దానిని తనయిష్టం వచ్చినట్లు నడిపిస్తుంది. అందుకే ఆమె సింహవాహన అయింది. అసురీ సంపద కూడా అట్లే బలమైనది. మానవులను సదా లొంగదీసుకుంటుంది. అట్టి అసురీ గుణాలను తన అధీనంలో ఉంచుకొని తన యిష్టం వచ్చినట్లు దాన్ని నడిపించాలి. దానికి తాను లొంగకూడదు కొన్నిసార్లు మానవుడు మంచితో కొన్నిపనులు సాధించలేడు. కొంత కాఠిన్యం వహించవలసి వస్తుంది. అట్టి కాఠిన్యాన్ని అదుపులో పెట్టుకోవాలని ఎదుటి మనిషిని చక్కచేయుటానికి కాఠిన్యం ఉపయోగపడాలేకాని అపకారం తలపెట్టకూడదని గ్రహించాలి. అదే దేవి సింహాన్ని అధిరోహించటము. ఆమె ఒక చేతిలో అగ్ని కుండమును పట్టుకొని ఉంటుంది. అగ్ని ప్రకాశమును వేడిని యిస్తుంది. కాని ముట్టుకుంటే కాలుస్తుంది. సర్వనాశనం చేస్తుంది. అటువంటి సచ్ఛీలాన్ని నిర్మాణం చేసుకోవాలని అగ్ని తనలో వేసిన ఏ పదార్థాన్నైనా ఎలా హరిస్తుందో అలాగే ఏచెడు ఆలోచన వచ్చినా హరించుకు పోవాలని సూచిస్తుంది. "If the character is lost every thing is lost" శీలం పోతే సమస్తము పోయినట్లేనని గ్రహించాలి. దేవి మరొక చేతిలో ఖడ్గముంటుంది. మానవ

సంఘంలో ఉద్దండత, అత్యాచారాలు, మోసము, దగా పెచ్చు పెరిగి పోయాయి. బలము కలవాడిదే రాజ్యమైంది. బలహీనుడు బలవంతుడి చేత కబళించబడుతున్నాడు. శక్తి లేకపోతే యిక్కడ మనమేమి సాధించలేము. శివుడు తన చేతిలో త్రిశూలము, శ్రీహరి తన చేతిలో సుదర్శనము శక్తి యొక్క అధిక్యతను తెలియజేయటానికే ధరించారు. శక్తివలననే సింహం మృగరాజు అయినది. శక్తి లేకపోతే భక్తిని ఎవరూ అంగీకరించరు. ప్రహ్లాదుడు భక్తిగలవాడే హిరణ్యకశిపుడు పెట్టె బాధలకు అతడు మరణించి ఉంటే అతని భక్తి లోకానికి వెల్లడి అయ్యేదికాదు. పాములతో కరిపించినా అతను చావక పోతే అతనిలో ఏదో శక్తి కలదని గ్రహించా . హిరణ్యకశిపుడు ఆశక్తిని తెలుసుకోవటానికి అతడు చేసిన ప్రయత్నము వలననే నృసింహావతారం ఆవిర్భవించింది. అట్టి శక్తిని సంపాదించుకోమని దేవి చేతిలో ఖడ్గం మనకు బోధిస్తుంది. దేవి మరొక చేతిలో మాలవుంటుంది. బ్రహ్మాండంలో వుంటూ బ్రహ్మ కోసం వెదుకుతాడు. ఎవడో కంబట్లో అన్నం తింటూ బొచ్చు ఎక్కడ ఉందని అడుగుతాడట నీళ్ళలో చేప దాహమై నీళ్ళు ఎక్కడన్నా దొరుకుతాయా అని విచారిస్తే నవ్వటమేగాని మనం ఏమి చేయగలము. కస్తూరి మృగము తన నాభిలో నుండి కస్తురి వెదజల్ల బడుతూ వుంటె తెలుసుకోలేక సువాసన ఎక్కడ నుంచి వస్తున్నదా అని వెదకుతుంది. పరమాత్మ అంతఃపూర్ణం, బహిః పూర్ణం అని బాహ్యాంతరాలలో నిండివుంటే దేవుడున్నాడా అని వెదుడుతూ వుంటాము.

యదార్థంగా దేవుణ్ణి గుర్తించక పోవటమే లోపం కాని భగవం తుడు సర్వత్రా నిండి ఉన్నాడు.

మనం ఒక వ్యక్తిని కలవటానికి ఊరికి వెళ్ళి ఉంటాము ఆ వ్యక్తి మనం వెళ్ళినపుడు బయటకు వెళ్ళాడు. అతన్ని కలవటం కోసం మీకా టయిముందికదా అని దగ్గరున్న సినిమా హాల్లోకి మనం వెళ్ళాము. మనం కలవాల - కున్న వ్యక్తికూడ మన ప్రక్కనే కూర్చొని మూడు గంటల కాలం వెళ్ళబుచ్చినా అతడు మనకు తెలియదు. ఎవరైన ఒకడు మనలను అతనికి తెలిసిన వాడు వచ్చి ఇతడే అతడని చెప్పవలెను. అట్లు చెప్పెడి వానినే గురువు అందురు. పరమాత్మ అందరిలోను కలడని దారములోని మణులవలె ఈజగత్తు అంతా పరమాత్మ చేత గుచ్చబడినదని మాల నిరంతరం గుర్తుచేస్తుంది. మాలలో పూసలు కనిపిస్తాయేగాని ఆ పూసలు నిలువటానికి ఆధారమైన దారము కనిపించదు.

మత్తః పరతరం నాన్యత్కించి దస్తి ధనంజయ
మయి సర్వమిదం ప్రోతం సూత్రేమణి గణాఇవ

(గీత 7-7)

సూక్ష్మ బుద్ధితో ఆలోచిస్తే ఈ విషయము అర్థమౌతుంది. స్థూల దృష్టిని కాళీమాతకు బలియిచ్చాం కదా సర్వ వ్యాపి యైన పరమాత్మను సూక్ష్మ దృష్టితో తెలుసుకోవాలి. ఆ

విషయం తెలియకనే నేటి సమాజంలో మానవుడు జపమాలను త్రిప్పుతూ జపం చేస్తూ ఉంటాడు.

మాలాతో కరమెఫెరై జ్‌భ్ ఫిరై ముఖమహి
మనవాతో దశదిశ ఫిరై యహ్‌తో సుమరిక్‌వాహి

(కబీరుదోహ)

అని కబీరు అన్నట్లుగా చేతితో మాలను త్రిప్పుతూ మనస్సు దశదిశలా పరిగెడుచున్న అది స్మరణ మెట్లగును.

దేవి వేరొక చేతిలో "గీత" పట్టుకొని ఉంటుంది. గీత నిరంతరం త్యాగాన్ని గురించి బోధిస్తుంది. దాన్ని వర్ణవ్యత్యయం చేసి తాగీ తాగీ అంటే తనలో మకరందాన్ని (గీత మకరందాన్ని) త్రాగమని గీత బోధిస్తుంది. "నకర్మణాన ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మాన శుః" (కైవల్యోపనిషత్తు) మానవుడు అమృతత్వమును పొందవలెనన్న కర్మల చేత సంతతి చేతకాదు. దేహం నేననే భావాన్ని త్యాగం చేయమని ఉపనిషత్తు బోధిస్తున్నది. అహల్యాబాయి హోల్కారు చెప్పిన మాటలనే గీత కూడ "క్షేత్రే క్షేత్రే ధర్మంకురు" అంటున్నది. మనం ఏ రంగంలో ఉన్నామో ఆ కర్తవ్యాన్ని నిర్వహించుటం మన ధర్మము అవుతుంది. ప్రస్తుతం కర్తవ్య నిర్వహణ లోపమే మన దేశంలో ఎక్కువగా కనిపిస్తున్నది. ఈ దేశంలో పుట్టి ఈ దేశ ధనమును వెచ్చించి విద్యావంతులై ఈ దేశమునకు సేవ చేయకుండా కేవల ధనాశతో మన

పౌరులు యితర దేశాలకు వలసపోతున్నారు. ఇది వారి ధర్మ నిర్వహణ కాదు. దేశ పౌరుడిగా, భార్యకు భర్తగా, చెల్లికి అన్నగా, బిడ్డలకు తండ్రిగా ఆఫీసు వ్యవహారములను చూచునపుడు భగవంతుడికి బానిసగా విశ్వకర్మాగారంలో తానొక కార్మికుడిగా తన ధర్మాన్ని నిర్వహించవలసి ఉన్నది. తండ్రిగా తన బిడ్డలను ప్రేమించుట. వారిని సత్పౌరులుగా తీర్చిదిద్దుట, ఉద్యోగిగా దేశ భవిష్యత్తును కాపాడుటకు తన శాయశక్తులా కృషి చేయుట సాటి మానవునిగా మమతను పంచి పెట్టుట తన ధర్మాన్ని (మతాన్ని) రక్షించటం కోసము తన శక్తి వంచన లేకుండ కృషి చేయుట ఇవి మానవుని కనీస ధర్మాలు. తన శ్రేయస్సు కాక దేశ శ్రేయస్సును కూడ మానవుడు కాంక్షించాలి. కొన్నిసార్లు దేశ క్షేమం కోసం వ్యక్తి తనను తాను సమర్పించుకోవాలి. అలా చేయకపోతే దేశ భవిష్యత్తు దెబ్బ తింటుంది. వ్యక్తి శ్రేయస్సు కంటే సంఘ శ్రేయస్సు ముఖ్యము. అట్టి సంఘ శ్రేయస్సుకై వ్యక్తి గత విలువలను దాటపోయాలి.

మహా భారతంలో కర్ణుడు మహాత్యాగి దానకర్ణుడని ప్రఖ్యాతి పొందాడు. ఇంద్రుడు వచ్చి కవచకుండలాలు అడగగానే దానివలన కౌరవపక్షానికి అపజయం సంభవిస్తుందని తెలిసికూడ తాను దాత అనిపించుకోవాలనే కాంక్షతో వాటిని దానం చేశాడు. శిఖండి ముందు నిలబడితే అస్త్ర సన్యాసం చేయాలన్నది భీష్ముని వ్యక్తిగత నియమం. కౌరవ సైన్యాధ్యక్షుడైయుండి వ్యక్తిగత నియమం కోసం సంఘ నియమాన్ని

బలిపెట్టాడు. కౌరవసైన్యాధ్యక్షుడు అస్త్రసన్యాసంచేయటం దుర్యోధనుని ఓటమికి కారణాల్లో ఒకటైంది. ద్రోణుడుకూడ "అశ్వత్థామ హతఃకుంజరః" అన్నమాటవిని అస్త్రసన్యాసం చేశాడు. అశ్వత్థామ తన కుమారుడే. కౌరవ సైన్యానికి అతని మరణం వలననష్టము ఏమున్నది? తాను రణరంగములో కౌరవ సైన్యాధిపతిగానుండి కూడ స్వపుత్ర మరణం విషయంతో యుద్ధముమాని కౌరవపక్ష అపజయానికి కారకుడైనాడు. వాళ్ళంతా వ్యక్తిగత విలువలు కాపాడుకోవటం కోసం సంఘ విలువలను నిర్లక్ష్యం చేశారు. అదే పాండవ పక్షంలో ధర్మరాజు అబద్ధం ఆడడు అయినా అశ్వత్థామహతః అన్న అనృత దోషానికి సిద్ధపడ్డాడు. కుంతి కన్యగా నున్నపుడు సూర్యవరము వలన కర్ణుని ప్రసవించింది. తన జీవిత కాలములో మాతృ హృదయాన్ని చంపుకొని ఆ రహస్యాన్ని బయటపెట్టలేదు. పాండవ పక్షానికి విజయం సాధించటం కోసం తన వ్యక్తిగత విషయాన్ని బహిర్గతం చేసింది. తద్వారా తనశీలానికి కళంకితము ఆపాదించబడినా ఆమె లెక్కచేయలేదు. ఇలా ఆలోచిస్తే సంఘశ్రేయస్సు కోసము వ్యక్తి ధర్మాన్ని కొంత నిర్లక్ష్యం చేయవలసి వస్తుంది.

ధర్మక్షేత్రే, కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవశ్చైవ కిమకుర్వత సంజయః

(గీత 1-1)

ధృతరాష్ట్రుడు సంజయునితో అది ధర్మక్షేత్రము, అధర్ములు అందులో ప్రవేశిస్తే విజయం ఎలా లభిస్తుంది? అధర్మానికి విజయం లభిస్తే అది ధర్మ క్షేత్రమెలా అవుతుంది? అని ప్రశ్నించాడు.

తన కుమారులు అధర్మపరులని వారికి కురుక్షేత్ర సంగ్రామ భూమిలో విజయమెలా సంభవిస్తుంది? అని ధృతరాష్ట్రుని ప్రశ్న. గీత మనకు ఆదర్శప్రాయము కావటానికి భగవద్గీతలో ఎన్నో యిట్టి ధర్మ సూక్ష్మములున్నవి. మనలను మనం ఉద్దరించుకోవాలంటే గీతను రోజు చదవటం దాన్ని అర్థం చేసుకోవటం, ఆచరణలో పెట్టటం తల్లి చేతిలో గీతను చూడగనే ఆవశ్యకాలనిపిస్తాయి.

దేవి వేరొక చేతిలో గంట ఉంటుంది. మనంకూడ దేవాలయానికి వెళుతూ ముందు గంట కొడతాం. గంట ఎందుకు కొడుతున్నామో తెలియకనే అందరము ఆ పని చేస్తుంటాము.

> అగమార్థంతు దేవానాం గయనార్థంతు రాక్షసాం
> కురుఘంటారవం తత్ర దేవతాహ్వాన లాంచనమె

అనగా మనలో నున్న దైవీ సంపదకు ఆహ్వానము అసురీ సంపదకు వీడుకోలు తెలుపటం కొసము గంట కొడతాము.

ఆ నావానికి అనుకూలంగా మన మనస్సు భగవంతుని మీద లగ్నం కాగలగాలి. అలా కాకపోతే అనాటి మన దేవాలయ ప్రవేశము నిరర్థకము. మూడు సార్లు ప్రయత్నించి నా మనస్సు భగవంతునిపై కేంద్రీకృతం కాకపోతే దైవ దర్శనం నిరర్ధకము.

దేవి మరొక చేతిలో వికసించిన తామర కుసుమాన్ని పట్టుకుంటుంది. తామర నీటిలోనే ఉంటుంది. కాని నీరు ఒక్క చుక్క కూడ దాన్ని అంటదు. అలానే మనంకూడ సంసారములో ఉంటూ ఆ సంసారము మనలను అంటకుండా వ్యవహారం చేయాలి. తామర తన ఉనికితో కొలనికే సౌంద ర్యాన్ని ఆపాదిస్తుంది. మనం కూడ మన ఉనికితో మానవ సంఘానికి సౌందర్యాన్ని ఆపాదించాలి. బురదలో పుట్టిన తామర తన ఉత్కృష్టమైన గుణ సంపదచే లక్ష్మి దేవికి నివాస స్థానంగా మారింది. అలాగే హీన కులములో పుట్టినా ఉన్నత మైన భావాలు కలిగితే ఉత్కృష్ట పదాన్ని అలంకరించవచ్చు. దుర్మార్గుల్లోకూడ మంచితన్నాని చూడటానికి మనం ప్రయత్నిం చాలి. మన పెద్దలు నాగులచవితి నాడు పాముకు పాలు పోయమన్నది ఈ ఉద్దేశ్యంతోనే ఇతరులకపకారము కలిగించి కాటు వేసే పామువంటి దుష్ట జంతువుకు కూడ మనము అమృతమే పోస్తాము. మనది అట్టి ఉత్కృష్టమైన జాతి. నేనేకులంలో పుట్టాము అనికాక మానవ సంఘానికి ఎంత సహాయం యటానికి వీలవుతుంది. అన్న స్ఫురణ కలగటానికి తామర సూచకము.

అష్టభుజాదేవి విగ్రహాన్ని చూడగానే మనలను మనం సంస్కరించుకోవాలి అనే విషయం గుర్తుకు రావాలి. అంతే కాని ఆమెకు మన కోరికల లిస్టును సమర్పించి తలవంచి నమస్కరించటం కాదు. మనం తమస్సును అణచివేసుకొని రజస్సును అనుకూలంగా మార్చుకొని సత్వంలోకి ప్రవేశించి సరస్వతీమాత రూపాన్ని విచారణ చేద్దాము. మనం కాళి, లక్ష్మి, సరస్వతిగ విభజించామే కాని ఇదంతా మూల ప్రకృతి యైన లలితా స్వరూపమే. ఆయా గుణ అవిర్భావముతో తల్లి వివిధ నామరూపాలు ధరించింది. అమ్మలగన్న యమ్మయని ముగురమ్మల మూలపుటమ్మ అని చాలపెద్దమ్మ సురారులమ్మ యని కడుపారడి బుచ్చెడి అమ్మయని పోతనామాత్యుడు మహత్వ కవిత్వ పటుత్వ సంపదకొరకు ఆ తల్లినే ప్రార్థించాడు. ఈ సృష్టికి పూర్వము 'సదేవసేమ్యే దమగ్ర ఆసీతో ఏకమెవా ద్వితీయం బ్రహ్మ (ఛాం 2-6-2) నేహనా నాస్తి కించనః

(అధ్యాత్మోపనిషత్)

సృష్టికి ముందు సత్పదార్థమైన పరమాత్మయే నిండి యుండెను. ఏతస్మాదాత్మనః ఆకాశస్సంభూతః ఆకాశా ద్వాయుః వాయోరగ్ని అని ఉపనిషత్ప్రతిపాదించినట్లు ఆ సత్పదార్థము నుండి ఆకాశము, ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి నీరు, తద్వారా భూమి (పృధ్వి), పృధ్వి నుండి ఓషదలు, ఓషదుల నుండి అన్నము

అన్నము నుండి జీవజాలము ఉద్భవించినట్లు అర్థమగుచున్నది ఇవన్నీ అలాగే ప్రళయకాలంలో లయమైపోతాయి. ఆకాశానికి శబ్దం గుణము. సరస్వతి యొక్క వీణానాధంలో తన్మయుడై సృష్టికార్యం సాధించాడు బ్రహ్మ. సృష్టికి మూలం సరస్వతీ వీణాగానమే. అవాఙ్మనస గోచరమైన బ్రహ్మము నుండి జగదుత్పత్తికి ప్రథమకారణం.

సరస్వతీ జ్ఞానేన పరిసమాప్యతే

(గీత 4-33)

జ్ఞానము కలుగగానే ఈ జగత్తు యొక్క మిథ్యారూపము గోచరమౌతుంది. అప్పుడే జగత్తు లయమౌతుంది. ఏదేవి జగదుత్పత్తికి కారణమైందో ఆ దేవియో జగద్విలయానికి కూడా కారణమౌతుంది.

శ్రేయాన్ ద్రవ్యమయాద్య జ్ఞాత జ్ఞాన యజ్ఞం పరంతప
సర్వం కర్మాఖిలం పార్థజ్ఞానే పరిసమాప్యతే

(గీత 4-33)

ద్రవ్య సాధన యజ్ఞము లన్నిటికంటే జ్ఞాన యజ్ఞము శ్రేష్ఠమని ఆత్మజ్ఞానము పరిపక్వస్థితికివచ్చిన కర్మసంబంధము తనంతతానే వదలును. అయితే జ్ఞాన యజ్ఞానికి కొంతకృషి

అవసరము. రామాయణము కూడ మనకా విషయాన్ని బోధిస్తుంది. శ్రీరామునకు రామాయణంలో ముగ్గురు స్త్రీలతో పరిచయమేర్పడుతుంది. తాటక, అహల్య, సీత వీరు తమస్సు రజస్సు, సత్వానికి ప్రతీకలు. తమోగుణము కలిగిన తాటకను రాముడు సంహరించాడు. రజోగుణము కలిగిన అహల్యను రాతి రూపం నుండి నాతి రూపానికి మార్చాడు. సత్వగుణము కలిగి సీతను చేబట్టాడు. తరువాత గుణాతీతుడు కావలంటే సత్వాన్ని కూడ వదలివేయాలి. కాబట్టి సీతను పరిత్యాగం చేయవలసి వచ్చినది. తమోగుణ ప్రధానుడైన కుంభకర్ణుని సంహరించి రజోగుణము కలిగిన రావణాసురుని తనలో ఐక్యము చేసుకున్నాడు. సత్వగుణ ప్రధానుడైన విభీషణుని చేపట్టాడు. సత్వంవల్ల దేనినైనను సాధించవచ్చు.

"సత్వాత్యం జాయతే జ్ఞానం"

(గీత 16-17)

సత్వం వల్ల జ్ఞాన సిద్ధి కలుగుతుంది. తమస్సు నుంచి రజస్సు నుంచి విడివడి సత్వంలో ప్రవేశించగానే సద్గురువును పొందాలనే జిజ్ఞాస కలిగిందో సరస్వతి ఆవిర్భవించినట్లు తెలుసుకోవాలి. జిజ్ఞాసకై శుభేచ్ఛ కలుగుటయే జ్ఞానభూమికలో ప్రథమ సోపానము. అట్టి జిజ్ఞాస కలుగగానే సద్గురువును

సమీపించి "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా, ఉప దేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞాని నస్తత్వదర్శినః"

(గీత 4-34)

మనకు తెలిసి ఎదుటివారికి తెలియునో తెలియదో తెలుసుకుందామనుకునేది ప్రశ్న, మనకు తెలియని విషయాన్ని తెలియచేయవలసినదిగా కోరేది పరిప్రశ్న. ఆత్మ విషయక మైన విషయాన్ని తెలుసుకోవాలంటే సాష్టాంగ నమస్కారము చేసి, గురువును చేరి వారిద్వారా ఉపదేశము నందవలెను. మనోసృష్టి ఎంత చిత్రంగా ఉందంటే ఒక సామాన్య పురోహి తుడు నేడు ద్వాదశి, రేపు అమావాస్య మంచికాలము కాదు. రేపు వర్జ్యం ఇపుడు రాహుకాలం అంటే మనం నమ్మి ఆయా పనులను ఆయా సమయాల్లో చేయటానికి ఇష్టపడం. శ్రుతి "జీవో బ్రహ్మైవ నాపరః" అంటే మనం నమ్మటం లేదు. శ్రోత్రియుడు బ్రహ్మనిష్టుడైన సద్గురువును సమీపించి జీవుడు బ్రహ్మము కంటె భిన్నము ఎలా కాదో తెలుసుకోవాలి. సత్వం కలిగే వరకు గురువు అవశ్యకత లేదు. తత్వ దర్శి అయిన గురువు తన ఉపదేశం ద్వారా బ్రహ్మవిద్యాభ్యాసం చేయిస్తాడు. కణ కణ మండే అగ్నిలో ఎంత పచ్చి కట్టెలు వేసినా రగు లొక్కొని ఎలా మండుతాయో అలాగే త్వతదర్శి అయిన గురువు శిష్యుని బ్రహ్మ విద్యాభిముఖుని చేసి వాని అజ్ఞానాన్ని పోగుడుతాడు.

సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్వం
నిశ్చలతత్వే జీవన్ముక్తిః

(భజగోవిందం)

అని ఆదిశంకరులు సెలవిచ్చినట్లు సజ్జన సాంగత్యము వలన జీవన్ముక్తిని సాధించ వచ్చును. అట్టి సజ్జనుడు సద్గురువు తప్ప వేరెవరుందురు.

యథైధాం సిసమిద్ధోఽగ్ని భస్మసాత్కురు తే ఽర్జున
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా

(గీత 4-3)

మండుచున్న అగ్ని కట్టెలను కాల్చునట్లు జ్ఞానాగ్ని సర్వకర్మలను కాల్చివేయును అట్టి జ్ఞానమునుపొందుటకు శ్రద్ధ విశ్వాసము అవసరము. 'శద్ధావాన్ లభతే జ్ఞానమ్'' విశ్వాసవాన్ లభతే జ్ఞానం, జ్ఞానం లబ్ధ్వాపరాంశాంతి నచిరే ణాపి గచ్ఛతి అని గీతాచార్యుడన్నట్లుఅంతరంగిక యోగమార్గాన్ని అధిరోహించే సాధకునకు సరస్వతీమాత ప్రత్యక్షమవుతుంది.

''చదువు చదివి చదివి చావంగ నేటికి చావులేని చదువు చదువవలయు'' అనగా చావులేని చదువు తిరిగి పుట్టుకలేని

చదువే కదా. ఆ విద్యరాని వాడు వింత పశువని "విద్యా విహీనః పశుః" అని భర్తృహరి వ్రాక్రుచ్చెను.

మన మందిరము విద్యనేర్చుకున్నామని మనకు చాలా డిగ్రీలున్నాయని అనుకుంటాం. ఈ విద్య పొట్టకూటిని సంపాదించేదేకాని పరమార్థాన్ని తెలియచేసేది కాదు. మన మందరము విద్యావంతులమే అయితే ఇప్పటి వరకు మనం చెప్పుకున్న పశుత్వ లక్షణాలు ఉండకూడదు. ఆ లక్షణాలు కలిగి ఉన్నంతవరకు మనం చదువుకున్న వాళ్ళమే కాని విద్యావంతులం మాత్రం కాదు. "విత్" అనే ధాతువునకు తెలుసుకోవటం అని అర్ధము. ఆత్మను గురించి ఎవడు తెలుసుకుంటాడో వాడే విద్యావంతుడు, అట్టి జ్ఞాన సూచకమే శుద్ధ ధవళ వర్ణము.

"యాకుందేందు తుషారహార ధవళా యాశుభ్ర వస్త్రాన్వి
తాయా వీణావరదండ మండితకరా యాశ్వేతపద్మాసనా"

అని సరస్వతీ దేవిని వర్ణిస్తారు. నిష్కళంకానికి ధవళ వర్ణము చిహ్నము. ఏ కొంచెము మురికి అంటినా అంటినట్లు తెలిసేది ధవళవర్ణానికే కదా. మిగిలిన రంగులన్నీ మురికిని తమలో నిక్షిప్తం చేసుకుంటాయి. తెలుపుమాత్రం కొంచెమంటినా ఆమురికిని చూపిస్తుంది. అంతర్ముఖమైన యోగులకు సరస్వతీ స్వరూపము గోచరిస్తుందట. వారామెను వర్ణిస్తూ కలువలు, చంద్రుడు, హిమము కలిస్తే ఎంత తెల్లగా ఉంటాయో

అంత స్వచ్ఛమైన వర్ణము సరస్వతీ దేవి కలిగి ఉందని వారు తెలియచేశారు. చేతిలో వీణ స్ఫటికమాల వేద గ్రంథం శ్వేత వస్త్రం మనలో స్వచ్ఛతను కలిగించటాన్ని సూచిస్తాయి.

సత్వంలో నున్న వానికి కామ క్రోద లోభ మోహ మద మాత్సర్యాలనే ఏ మురికి అంటినా వెంటనే కనిపిస్తుంది వాడా గుణము నుండి బయటపడటానికి ప్రయత్నిస్తా . మంచి వాళ్ళకు ఏదైనా చెడుబుద్ధి పుట్టినపుడు ఆ చెడును విచారణ చేసి తన మనస్సు చెడువైపుకు ఎందుకు మొగ్గినదాయని పదే పదే పరీక్షించుకుంటాడు. అదే అజ్ఞాని అయితే తన చెడును సమర్ధించుకుంటాడు. జ్ఞాని తెలుసుకోవటం, అజ్ఞానికి తెలియకపోవటం అంటే యిదే కాళి తమోమూర్తి, లక్ష్మి రజోమూర్తి సరస్వతి సత్వమూర్తి. కాళిమాతను నల్లగాను లక్ష్మీదేవిని ఎఱ్ఱ చీరతోను సరస్వతీ మాత తెల్ల చీరతోను మనకు కనిపించటానికి యిదే కారణము. 'అవ్యక్త నిరాకార నిర్గుణం నుండి వచ్చిన మొదటి శబ్దం "ఓం" ఇది అకార ఉకార, మకార అర్ధమాత్రల సమ్మేళనము. క్రమంగా 'అ' కారం సృష్టిని, 'ఉ' కారం స్థితిని 'మ' కారం లయను అర్ధ మాత్ర పరమాత్మను సూచిస్తుంది. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ (గీత 8-13) అని 'ఓం' అనే ఒక అక్షరమే బ్రహ్మ స్వరూప మని పెద్దలు తెలియచేశారు. పిల్లలకు కూడా విద్యాభ్యాసం చేయించే రోజులలో "ఓం నమశ్శివాయం" యను పంచాక్షరీ మంత్రాన్ని అధ్యాపకుడు బోధిస్తాడు. అదే వైష్ణవులైతే 'ఓం

నమోనారాయణాయ'' అనే అష్టాక్షరీ మంత్రాన్ని ఉపదేశిస్తాడు. అక్షరాభ్యాస కాలం నుంచి అక్షరములు పూర్తిగా నేర్చుకునే వరకు విద్యార్థి ఎన్నోసార్లు ఆ నామజపం చేస్తాడు. తెలియక చేసిన అజప ప్రభావం వాడిమీద ఉంటుంది. కాని నేటి విద్యా విధానంలో అమ్మ, ఆవు, ఇల్లు, ఈగ, ఉడత, ఊయల, ఎలుక, ఏనుగు అని మానవ జన్మ కలిగిన అమ్మతో ఆరంభించి క్రమంగా పశుపక్ష్యాదుల జన్మలను తలంచుకుంటూ క్రమంగా అట్టివారే కావటానికి అవకాశముంది. దుర్లభమైన మానవ జన్మ మెత్తి కూడ అంతకంటె ఉత్కృష్టమైన స్థితిని ఆశించక కొండపైకెక్కిన మేక కొండచరియలలోని, లోయల లోని గడ్డికాశించినట్లున్నది. ఫలితము క్రింద పడటమేకదా. శ్రేయోదాయకమైన నరజన్మ పొందికూడ సార్థక్యాన్ని పొందక (ఉన్నతమైన ఉత్కృష్టమై స్థితినాశించక) పతనమవటానికే నేటి విద్యావిధానం దోహదము చేస్తున్నది. నేటి పాశ్చాత్య నాగరికతా వ్యామోహము ఎంతవరకొచ్చిందంటే భారతీయ సంస్కృతి ఘనంగా అనిపించకపోతే పాశ్చాత్యుల మమ్మీ, డాడీలే గొప్పగా తోస్తున్నాయి. ''అమ్మా'' అని పిలిచే అన్న మడగని నోడున్ తమ్ముల బిలువని నోరును కుమ్మరి మనుద్ర విననట్టి గుంటర సుమతీ''!

అనిసుమతీ శతకకారుడు చెప్పినట్లు అమ్మను అమ్మా అని పిలువక మమ్మీ అని పిలుచుట ఏమి సమంజసము. ఈజిప్టు లో శవాన్ని ఉంచి కట్టే సమాధులకు ''మమ్మీ''లని పేరు. ఆ

పేరుతో పిలిపించుకోవాలని నేటి మాతృమూర్తులు సరదాపడు చున్నారు. శైవులకు, వైష్ణవులకు అభేదమని సూచించటానికి రామమంత్రం ప్రవేశించింది. శివాయ విష్ణురూపాయ, శివ రూపాయ విష్ణవే'' అనిశివకేశవులకు అభేదస్థితినిరామమంత్రం సూచిస్తుంది. ఓం నమోనారాయణాయలో 'ర' కారం లేకపోతే అర్థంలేదు. అందు ముఖ్యమైనది 'ర' కారమే నమశ్శివాయ లో 'మ' కారము తీస్తే శివుడే లేడని అర్థము గోచరిస్తుంది. అందుచే ఇందు ముఖ్యమైనది 'మ'కారమే ఈ రెండింటినికలి పితే'రామ' ఏర్పడుతుంది. అంతేకాని రామఅనగానేదశరథుని కుమారుడు రాముడు కాదు. మనం ప్రతి మంత్రానికి మొదట 'ఓం' చెర్చి చివర ''నమః'' అంటున్నాము. ఓంకారము బిందు సంయుక్తము ''నిత్యము ధ్యాయంతి యోగినః'' కామదం. మోక్షదం, చైవ ఓం కారాయనమో నమః అని ఓంకారాన్ని గురించి పెద్దలన్నారు. బిందువుతో కూడిన 'ఓ' ను ఎవరైతే నిత్యము ధ్యానముచేస్తారో వారికిఐహికా, మాష్మిక సుఖాలన్నీ లభ్యమౌతాయట. మొట్టమొదట బ్రహ్మము నుండి వెలువడిన శబ్దం ''ఓం'' అని మనం యింతకు ముందే చెప్పకున్నాము. ప్రకృతిలో ప్రతి..త్యము ప్రతిధ్వనించే యీ శబ్దాన్నే ''ప్రణవం'' అన్నారు. నాదం దాని ప్రథమ స్వరూపం ప్రకృతి ఓంకారాన్ని పలుకుతుందో లేదో తెలుసుకోవాలంటే ఎవరూ లేనపుడు (ఏ శబ్దాలు లేనపుడు) ఒక చెవిని గట్టిగా మూసుకొని రెండవ చెవిని నేల కానించినట్లయితే ఓంకారం మనకు భూమి నుండి వినిపిస్తుంది. రెండు చెవులను రెండు

వేళ్ళతో గట్టిగా మూసుకుంటె మన లోపలనే ఒక ధ్వని వినిపిస్తుంది. అది ఓంకార నాదమే. ఇలా బాహ్యాంభ్యాం తరాలలో ఓంకార జపం జరుగుతూ ఉన్నది. ఆకాశంలో గాలి హోరున వీస్తున్నదని నీరు గల గల ప్రవహిస్తున్నదని అగ్ని భగ భగ మండుతుందని అంటే అవి ఓంకారాన్ని జపి స్తున్నాయన్నమాట, ఈ పంచ భూతాలతో సమ్మిళితమైన మానవుడు తన అహంకారంతో దీనిని గ్రహించలేకున్నాడు.

మన శరీరమే ఒక వీణాదండము. సరస్వతి చేతిలో వీణ వాయిస్తున్నట్లు ఆ వీణానాదానికి సృష్టి జరిగినట్లు మన మింతకు ముందే చెప్పుకున్నాము. ప్రకృతియే సరస్వతిమాత అయితే మన దేహమే ఆవిడ చేతిలోని వీణ. మన వెన్నుపు కయే వీణాదండము మన శిరస్సు మనకటి భాగము వీణ యొక్క రెండు బుర్రలు. ఇడపింగళ సుషుమ్న అ మూడు నాడులే వీణాదండం పై తీగలు. మూలాధారము నుండి సహస్రారము వరకుగల ఏడు చక్రములు సరిగమపదని అను ఏడు మెట్లు. ఈ స్వరాలు ఏఏ స్థానంలో పలుకుతున్నాయో మనం మెల్లగా పరిశీలిస్తే మనకావిషయం అర్థమవుతుంది. ఆ వీణా దండంలో పలికించేవే మనం మాట్లాడే శబ్దాలు. శబ్ద సృష్టియే సరస్వతి గావించిన సృష్టి. సామవేద సారము సంగీతమన్నారు. సంగీతము ద్వారా త్యాగయ్య, అన్నమయ్య మొదలగువారు ముక్తులైన విషయము జగద్విదితమే. మనం కూడా మన దేహమనే వీణ ద్వారా మాట్లాడే ప్రతి పలుకు

వీణానాదమే. వీణలోగాని, దండములోగాని, బుర్రలలోకాని ఏదైనా ఒక పదార్థం ఉంటే ఆ వీణ అపశృతి పలుకుతుంది. మనలోకూడ వాసనలుంటే మనం మాట్లాడేవి కూడ అపశబ్దాలే అవుతాయి. లౌకికమైన విషయాల్ని గురించి మాట్లాడేవన్నీ అపశబ్దాలే. పారలౌకికమైన విషయాన్ని గురించి మాట్లాడే వన్నీ శబ్దాలవుతాయి. ఒకపుడు గోపికలకు కృష్ణుని చేతిలో నున్న మురళిపై అసూయ కలిగింది. పరమాత్మ పెదవులను ఎప్పుడూ స్పృశిస్తూ కూర్చోవటానికి ఆ మురళి ఎం పుణ్యము చేసుకుందో కదా అని గోప కాంతలు ఆలోచించారు. కృష్ణుడిది గమనించాడు. మురళికి తొమ్మిది రంధ్రాలున్నాయి. వరుసగా ఏడు మొదట చివర కలిసి రెండు. దాని లోపల డొల్ల. పరమాత్మ పెదవులపై నుంచుకొని ఏ రాగాన్ని పలకిం చాలనుకుంటే ఆ రాగం పలుకుతుంది తనదంటూదానికి ఏమి లేదు. అలా అహం లేకపోబట్టే భగవానుడు దాన్ని చేరదీశాడు. వేదురు తనలోని పదార్థామున్నంతా తీసి డొల్ల చేస్తుంటే చితికి పోకుండా (బాధపడకుండా) తనకంటూ ఒకటి లేకుండా పోతే మంచిదే కదా అని అనుకుంది. తరువాత కడ్డీని కాల్చి కన్నాలు చేస్తుంటే అప్పుడు కూడ బాధపడలేదు. అలా తనకంటూ దేనిని ఉంచుకోకపోబట్టే అది పరమాత్మ యొక్క అదరామృ తాన్ని గ్రోలగలిగింది. అలాగే మనం కూడ వాసనలను లేకుండా ఖాళీ చేసుకుంటే భగవంతుడు మనలనుకూడఅనుగ్ర హిస్తాడు. నవరంధ్రాలు మనకుకూడా ఉన్నాయి. పరమాత్మ ప్రాణవాయువురూపంగావాయువుపూరిస్తూనేఉన్నాడు(ఉచ్ఛ్వాస

నిశ్వాసల ద్వారా) కాని అనేక కోరికలు మనలో ఉండటం వలన మనం భగవంతుని సమీపానికి వెళ్ళలేక పోతున్నాము. మనం వేసుకున్న అజ్ఞాన ఆవరణ విక్షేపములనే అడ్డుతెరలే పరమాత్మ నుండి మనలను వేరుచేస్తున్నాయి. ఆ తెరలు తొలగితే ఉన్నది బ్రహ్మమే. త్యాగరాజు "నాలోని మదమాత్సర్యమనే తెర తీయగరాదా" అని వేడుకొన్నది. ఈ విషయాన్నే సూచిస్తున్నది.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామిమాశుచః

(18-66 గీత)

అని పరమాత్మ గీతలో ఈ విషయాన్నే ప్రతిపాదించాడు నీదంటూ ఏమీ లేకుండా వదిలేస్తే అన్నీ నేనే చూచుకుంటాను అన్నాడు. కాని మానవుని అజ్ఞానం అలా వదలనివ్వదే. విచారణ ద్వారా మనలో నున్న వాసనలను తొలగించుకోవటానికి మనం కృషి చేయాలి. అలాచేయటానికి మనకు బలం చాలకపోతే భగవంతుడు వేరొక మార్గం ఉపదేశించాడు. సాలోక్య సామీప్య, సారూప్య సాయుజ్యములనే క్రమ ముక్తి మార్గమదే. మన కిష్టమయిన ఒక దేవతామూర్తిని మనస్సులో నిలబెట్టుకొని లేదా ఒకచోట ప్రతిష్ఠించుకొని ఆ విగ్రహానికి సమీపములో కూర్చొని దాన్నే చూస్తూ ఉండాలి. కొన్ని రోజులకు ఆ దేవతామూర్తి యొక్క గుణగణములు వారి ఆదర్శము

వారి ధర్మము మనకు జ్ఞాపకం రావటం మొదలుపెడతాయి ఉదాహరణకు రాముడు మనకు యిష్ట దైవమైతే శ్రీరాముని విగ్రహాన్ని ఒక చోట ప్రతిష్టించి ప్రతి దినము ఆ విగ్రహము ముందు కూర్చొని ఆ రాముణ్ణి చూస్తు ఉండాలి. కొన్ని రోజులకు ఆ రామునిలోని ఏక పత్నీ వ్రతము, పితృవాక్య పరిపాలన, శరణాగత రక్షణ, ధర్మ నిర్వహణ, కర్తవ్య పారాయణత అర్థమై మన ఆదర్శమూర్తియైన రాముని వలె మనం కూడ ఉండటానికి ప్రయత్నిస్తాము. ఎప్పుడు మనలో రాముని లక్షణాలు స్థిరపడతాయో అపుడు రాముడు సాయుజ్య ముక్తిని ప్రసాదిస్తాడు. విచారణ ద్వారా సద్యోముక్తి ని ఆరాధన ద్వారా క్రమముక్తిని పొందవచ్చు.

మహాశక్తి సరస్వతీరూపంగా ఆవిర్భవించి తన శబ్దంతోనే నామాన్ని రూపాన్ని సృష్టించింది. నామరూప సృష్టికి సరస్వతి యే మూలము బాష లేకపోతే భావము కూడ లేదు కదా. బాష భావము నామము, రూపము అవుతుంది. మహాకవి కాళీదాసు "వాగర్థా నివసంపృక్తా వాగర్థి ప్రతి పత్తయే (రఘు వంనము 1-1) అని ప్రార్థించాడు. పార్వతీ పరమేశ్వరుల వలె, ప్రకృతి పురుషులవలె వాగర్థములు విడదీయ వీలుకానివి మ్యావ్ అని వినిపించగానే పిల్లి రూపం కనిపిస్తున్నది కదా. ఆ మ్యావ్ శబ్దమే మనలో పిల్లి రూపాన్ని సృష్టించి అది పిల్లి అని మనకు చెప్పింది. అలా మనం వినే ఎన్ని శబ్దాలకో అన్ని రూపాలు, అన్ని నామాలు మనలో సృష్టి అవుతున్నాయి.

దానినే మనో సృష్టి అంటాము. మనలోనున్న జీవ బ్రహ్మ శబ్దాన్ని వింటూనే సృష్టిగావిస్తున్నాడనిన వారి బ్రహ్మలు మనలో నుండిరా? లేక సత్య లోకంలోనా అని యోచించ వలసి వస్తుంది, అందుకే భగవానుడు గీతలో ఈ సమస్త జగత్తు నాలోనున్నది నేను వాటిలో లేను అన్నాడు.

ఎవరైనా పాము అనగానే పాము రూపం కనిపించి దాని తాలూకు కంపనం మన శరీరంలో కలుగుతుంది. వాళ్ళు ఎప్పుడో చూచిన పామును గురించి చెప్తున్నారన్న ఆలోచన లేక యిక్కడే పామున్నట్లుగా భయపడతారు. శబ్దం నామ రూపాన్ని సృష్టిస్తుందని దీని ద్వారా మనకు రూఢి అవుతున్నది శబ్దాన్ని వినగానే మనలో సృష్టి జరగటానికి ఏ వస్తువులు కావలసి వచ్చాయి.? మనలో పిల్లి, పాము సృష్టించబడటానికి ఏ వస్తువులు ఎలా అవసరంలేదో అలాగే బ్రహ్మ ఈ సమస్త జగజ్జాలాన్ని సృష్టించటానికి ఏ వసువుల అవసరం లేకుండా, పోయింది. అందుకే దీవిని సంకల్పమాత్ర సృష్టి అన్నారు. ఇది ఉన్నదా అంటే ఉంది, లేదా అంటే లేదు. యదార్ధంగా లేక ఉన్నట్లుగా కనిపించేదే మిధ్య. మిధ్య అనగా అసలు లేనిది కాదు. నిజంగా ఉన్నది కాదు. ఉన్న దానివలె కనిపించునది అని అర్ధము.

ఒకసారి యిక్కడ మనం మన స్వప్నాన్ని గుర్తుచేసు కుందాము. కలలో మనం ఒకపడవఎక్కి నదిమీద విహారంగా వెళ్తుంటాము. ఆ నది కవతల ఒక పెద్ద అడవి. ఆ అడవిలో ఒక పులి మనల్ని చంపటానికి సిద్ధంగా ఉన్నది. ఒక ప్రక్కన తప్పించుకుందామని ప్రయత్నిస్తే నలుగురు దొంగలు మనల్ని పట్టుకొని మన నగలను దోచుకోవటానికి ప్రయత్నిం చారు. వాళ్ళ నుండి తప్పించుకోలేక పులి మ్రింగుతుందన్న భయంతో పెద్దగా కేకలు వేస్తున్నాము. మెళకువ రాగానే పులిలేదు. దొంగలు లేరు. నది లేదు. నావ లేదు. మన మంచం మీద దోమ తెరలో మనమే పడుకొని ఉన్నాము. అయితే మనం చూచినది అబద్ధమా? అబద్ధమే అయితే మనకు భయం ఎందుకు కలిగింది. మరి నిజమా? నిజమైతే ఇప్పుడు పులి ఏది? దొంగలేరి? నిద్రలో మన మనస్సే మన రూపాన్ని దొంగ రూపాన్ని, నది రూపాన్ని, నావ రూపాన్ని, పులి రూపాన్ని పొందింది. మనస్సు ఒకసారి ఒక రూపం మాత్రమే పొందగలదు. దాన్ని వదలి వేరొక రూపాన్ని పొందుతుంది. ఇవన్నీ అతి వేగంగా జరుగుతాయి. అందువల్ల మనకన్నీ ఒకసారే కన్పించినట్లు అనిపిస్తుంది. కొంచెము సూక్ష్మంగా ఆలోచిస్తే నావ చూచినపుడు నది కన్పించదు. నది చూస్తు న్నపుడు మనం కనిపించము. దొంగల్ని చూస్తున్నప్పుడు పులి కనిపించదు. పులిని చూస్తున్నప్పుడు దొంగ కనిపించడు ఇలా మన మనస్సు అనేక రూపాలు పొందుతుంది. అందుకే మనం దాన్ని స్వప్నం అంటున్నాము. నిజంగా లేకుండా

ఉండి ఉన్నట్లుగా భ్రమకలిగించేది స్వప్నము. ఈ జగత్తంతా భగవానునకు స్వప్నతుల్యము. అందుకె బ్రహ్మ సత్యం జగన్మిథ్య (వేదాంతడిండిమము-66) అన్నారు.

మాతృ గర్భంలో ప్రవేశించిన మనకు మొదట్లో ఒక రూపం లేదు. నామం కూడ లేదు. ఆరు నెలల వరకు ఆడశిశువో మగశిశువో కూడ తెలియదు. జన్మించిన తరువాత పెద్దలు పేరు పెడుతున్నారు. అంతకు ముందే మన రూపం ఏర్పడింది. అంతకు ముందే మనం ఉన్నాము. దీనిని బట్టి నేను అనే ఒకడిని ఉంటే నాకు ఒక రూపం, ఒక నామం వచ్చాయి. నేను మాత్రము సత్యము. నా తరువాత వచ్చిన నామ రూపాలు అ సత్యము **నామరూపాలు** ధరించగనే ముందు గ్రహించేది శబ్దము.

బిడ్డ పుట్టగానే ఏడువకపోతే పళ్ళెంకొట్టి శబ్దం **చేస్తారు**. ఆ శబ్దాన్ని గ్రహిస్తాడు. అన్ని ఇంద్రియాల్లో శ్రవణేంద్రియము ముందు పని చేయటాన్ని చూస్తే ఉపనిషత్తు చెప్పిన "ఏతస్మాదాత్మనః ఆకాశ స్సంభూతః (తే. ఉ. ఆనందవల్లి 1) అని గుర్తుకు వస్తుంది. బ్రహ్మము నుండి వెలువడిన ఆ శబ్దాన్ని 'ఓం' కారముగా పెద్దలు గుర్తించినారు. ఆ శబ్దాన్ని దాటిన స్థితినే "నిశ్శబ్దం" బ్రహ్మ ముచ్యతే" అన్నారు. **అవిద్య**, ఆవరణ, విక్షేపాలనే మూడు మలినాలలో కాళీ ఉపాసన వలన అవిద్య, లక్ష్మి ఉపాసన వలన ఆవరణ, **సరస్వతీ** ఉపాసన వలన విక్షేపము తొలుగుతాయి. మనకు అజ్ఞానం

నశించగానే జ్ఞానం కలిగినట్లు కాదు. అజ్ఞానం నశించడం జ్ఞానం కలుగటం అనే రెండు పనులున్నాయి. దాన్ని సూచించటానికే మనము దేవుని దగ్గర రెండు దీపాలు వెలిగిస్తాము. ఒక దీపము ఎంత కాంతివంతంగా వెలిగినను ఆ దీపం ప్రమిద క్రింద మాత్రము చీకటిగా ఉంటుంది. రెండవ దీపం వెలిగిస్తే ఆ చీకటి పోతుంది.

"జ్ఞానం విజ్ఞాన సహితం లభ్యతే గురుభక్తితః" అన్న వాక్యములో జ్ఞానము, విశేష జ్ఞానంతో కూడ గురుభక్తి వలన లభ్యమవుతుంది. ఈ మాటలలో జ్ఞానమనగా స్థూలదృష్టి పదార్థ జ్ఞానము. విజ్ఞానమనగా సూక్ష్మదృష్టి వస్తు జ్ఞానమని అర్థము.

"దీపం జ్యోతి పరం బ్రహ్మ దీపం సర్వతమోహరం"

అని దీపం మనలో తమస్సును హరించటానికే ఉపయోగపడుతుంది. ఆత్మ విషయక జ్ఞానము మనకు ఎప్పుడు కలుగుతుందో అప్పుడు సరస్వతీమాత దర్శనం అయినట్లు మనం భావించాలి. అజ్ఞానంలో ఉన్నవానికి ఆత్మ విషయకమైన ఆలోచనే రాదు. సంధ్యా దీపాన్ని ఎందుకు వెలిగిస్తున్నామంటే చీకటి పడక ముందే దీపాన్ని వెలగించి చీకటి లేకుండా చేసుకోవటం ఒక పద్ధతి. చీకటి పడిన తరువాత దీపం వెలిగించుకొని ఆ చీకటిని తొలగించుకోవటం రెండవ

పద్ధతి. దుఃఖ భాజకమైన సంసార సాగరంలో పడకముందే ఆత్మజ్ఞానము కలిగి మెలకువతో వర్తించటము ఒక పద్ధతి. ధ్రువుడు ప్రహ్లాదుడు యిట్టి వారే జనకుడు, యాజ్ఞ్యవల్క్యుడు, భవసాగరములో ఉండి దానివలన కలిగే కష్టాన్ని గుర్తించి సద్గురువులను చేరి ఆత్మను ఎఱుగుట రెండవ పద్ధతి. ఆయువు చెట్టు చివరి కొమ్మ ఆకుపై నున్న నీటిబొట్టు లాంటిది. అది ఏ క్షణంలోనైనా పడిపోవచ్చును ఎవరైనా నేనెన్ని సంవత్సరాలు బ్రతుకుతానని ఖచ్చితంగా చెప్పగలరా? ఎప్పటికప్పుడు భౌతిక వాంఛలను ప్రక్కకు పెట్టి ఆత్మ విచారణ చేసుకోవటానికి సంసిద్ధులము కావాలి. రిటైరయిన తరువాత భగవన్నామము చేద్దామంటే అంతవరకు మనదేహము ఉంటుందన్న నమ్మకమేమిటి? ప్రతి పదార్థంలో సచ్చిదానంద రూపదర్శనం చేయగలగటమే నిజమైన సాధన. అను నిత్యం మనం చేసే పనులన్నీ భగవత్కార్యాలే, దృష్టి జ్ఞానమయం కాకపోబట్టి అన్నిటిలో భగవద్దర్శనం చేయలేక పోతున్నాము.

కుంకమను గురించి ఒకసారి ఆలోచిద్దాము. పసుపు కొమ్ములను నిమ్మరసములో నానబెట్టి వెలిగారం వేసి నూరితే పసుపుకొమ్ముల పసుపురంగు, వెలిగారపు తెల్లరంగు మాయమై ఆ స్థానంలో ఎఱ్ఱని కుంకుమ తయారౌతుంది. మనకు కనిపించే కుంకుమలో పసుపును వెలిగారమును చూడలేము. కాని అందులో పసుపు, వెలిగారము ఉన్నాయి. అలాగే సత్, చిత్‌లు సమ్మేళితమై జగద్రూపంగా గోచరిస్తుంది. మనకు

కనిపిస్తున్న ఈ జగత్తు బ్రహ్మమే. కుంకుమ పసుపే కాని పసుపుగా గోచరించనట్లు జగత్తు బ్రహ్మమే కాని బ్రహ్మముగా గోచరించదు. మన దృష్టిని జ్ఞానమయం చేసుకుంటే జగత్తంతా బ్రహ్మమయంగా తోస్తుంది.

"దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యేద్బ్రహ్మ మయం జగత్" అని ప్రతి వస్తువులో మనం బ్రహ్మమునే దర్శించ గలుగుతాము. మనది అజ్ఞాన దృష్టి యగుటవలన వివాహాది శుభ కార్యాల్లో కడుపు నిండిన వారిని మనం భోజనానికి పిలుస్తాము. వారు పరబ్రహ్మ స్వరూపమయిన అన్నాన్ని నిర్లక్ష్యంగా పారవేస్తారు. మనచేత పిలువబడినవారు, అథితులు మనం పిలువకనే వచ్చిన వారు అభ్యాగతులు. "అభ్యాగతః స్వయం విష్ణుః" అన్నారు. మనం పిలిచినవారు అన్నాన్ని పారవేసినా మనకు సంతోషమే.

మనచేత పిలువబడకుండా వచ్చిన అనాథలకు, దుఃఖితులకు భోజనము పెట్టడానికి మనము బాధపడతాము. మన దృష్టి జ్ఞానమయం కాలేదనటానికిది నిదర్శనం. కొందరు వంట చేసుకొని ఏదో అనవసరమైన వాగ్వివాదంతో అన్నం తినకుండా వుంటారు. మనుష్యుల పైన, వాళ్ళ గుణాల పైన కోపం కాని అన్నం మీద కోపించటం ధర్మమా? సర్వశక్తి స్వరూపిణి అన్నపూర్ణ స్వరూపములో మన సమీపానికి వస్తే ఆమెను (ఆ అన్నాన్ని) కాలదన్నే ప్రబుద్ధులు కోకొల్లలు.

దేవాలయానికి వెళ్ళి దేవిని ప్రార్థించి, ఇంట్లో కన్నకూతురిని, కట్టుకున్న ఇల్లాలిని, కన్నతల్లిని, తోడబుట్టిన సోదరుని ఏడిపించే ప్రబుద్ధులకు దేవీ కటాక్షమెలా లభ్యమవుతుంది? కరచరణాది అవయవాలతో నున్న అపరాశక్తిని గుర్తించకుండా పోవటమే అజ్ఞానము.

"యాదేవీ సర్వభూతేషు స్మృతీ రూపేణ సంస్థితా"

సాధకుని జ్ఞాపశక్తి సరస్వతీ మాత స్వరూపమే. ఏ విషయమైనా జ్ఞాపక ముంచుకొనకపోతే విన్నది విన్నట్లే మరచి పోతే అధ్యాత్మిక సాధనలో మిగులకష్టమవుతుంది. గురుదేవుల అమృత వాక్కులను స్మృతిగా భద్రపరుచుకోవాలి. అధ్యాత్మిక జ్ఞానాన్ని స్మృతి పేటికలో పదిలపరుచుకోవాలి. అలా కాకుండా ఈ నాడు విన్నది ఈనాడే మరచిపోతే ఆదిసరస్వతిని జారవిడవటమే అవుతుంది. శ్రవణ, మనన. నిధి ధ్యాసల ద్వారా మనం విషయ గ్రహణం చేయాలి. గురుదేవులు అమృత వాక్కులను పెద్దల ప్రవచనాలను ముందు శ్రవణం చేయాలి. తాను విన్నదాన్ని పదే పదే మననం చేసుకుంటే అది నిధి అవుతుంది. తిరిగి ఎవరికైనా చెప్పటం ప్రారంభిస్తే దాస్య రూపంగా ఉన్న ఆ విషయం బహిర్గతమవుతుంది. మన జ్ఞాపకశక్తిని స్థిరంగా ఉంచుకోవటమే సరస్వతీ మాతను సేవించటము.

మనం ఎవరితోనైనా మాట్లాడేటపుడు మన మనస్సులో వారి మీద ఒక భావము ఉండటము మన వాక్కు వేరొక

రకంగా ఉండటము సరస్వతీ మాతకు అన్యాయం చేసినట్లే. చాలామంది చెప్పేది ఒకటి చేసేది మరొకటి ఊహించేది వేరొకటి. అట్టివారు తమ మనస్సును అణచివేస్తున్నారు. అలా అణచి వేయబడిన మనస్సు యదార్థాన్ని గ్రహించలేదు.

నిప్పు పొగచేత, అద్దము దుమ్ముచేత, శిశువు మావిచేత కప్పబడినట్లు ఈ జ్ఞానం కూడ అహంకారంచే కప్పబడుతుంది దీనినే గీతాచార్యుడు

"దూమేనా ప్రియతే వహ్ని యదాదర్శమ లేనచ
యధోత్సానావృత్ గర్భస్తధాతానే దయునృతమే"

(గీత 3-38)

అని చెప్పాడు. పొగచేత కప్పబడిన అగ్ని ఎవరిచేత నైన ఊదబడి మండును. అద్దము మీది దుమ్ము ఎవరిచేత నైనా తుడవబడవలెను. మావిలోని శిశువుకూడ తనంతతాను గా రాలేదు. అలాగే అహంకారముచే కప్పబడిన జ్ఞానముకూడ గురువు ద్వారానే వెలికి వచ్చును. ఎవరు మన అహంకారాన్ని తెలియజేసి తన్నివారణకు సహాయ పడతారో అట్టివారినే గురువు అనవలెను. గురువు లేని విద్య గ్రుడ్డి విద్య అంటారు. భౌతిక విద్యలకు గురువు లేకున్నా నష్టము లేదు కాని అధ్యాత్మిక జ్ఞానము కలగాలంటే తప్పకుండా గురువు అవసరము. ఎవరైనా స్వార్థంతో మనకు సహాయం చేస్తారు.

జ్ఞాని గురువు మాత్రం నిష్కపటంగా, నిస్వార్థంగా సహాయం చేస్తాడు. అట్టి గురువు పరోక్షంగా నుండరాదు. కరచరణా ద్యవయవాలతో నీవలెనే నీకు సన్నిహితుడుగా నుండి నీ పారపాట్లను చూపెట్టి చెడుదారులు త్రొక్కకుండా నిన్ను సత్పథంలో నడిపించేవాడే గురువు.

ధర్మార్థ కామ మోక్షాలనే చతుర్విధ పురుషార్థాలలో మోక్షము అన్నిటి కంటే గొప్పది. గొప్ప లాభాన్ని పొందాలనుకునే వాడు కొన్ని నష్టాలనైనా ఎదుర్కోవాలి. మహాభారతంలో మోక్షార్థికి ఏమేమి కావాలో తెలియచేయబడినవి.

"త్యాగమొక నెలవు శమ షంయోగంబుత్తరము కూర్చ్వ ముసంతో షాగమము మోక్షలాభోద్యోగికి నివిగయ్యే భూములుత్త మధిషణా

(శాంతి 5-849)

మోక్షార్థి ముందు త్యాగాన్ని అలవరుచుకోవాలి. అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహము అతనికావశ్యకములు. శరీరం చక్కగా పెరగాలంటే మంచి ఆహారము అవసరము. ఆహారమంటే నోటితో తీసుకొనేదే కాదు. కళ్ళతో చూచేది చెవితో వినేది. పంచేంద్రియాలతో అనుభవించేది ఆహారమే అట్టి ఆహారాన్ని గ్రహించేటపుడు జాగ్రత వ్యవహరించాలి.

ఎఱుకగలవారి చరితలు గఱచుచు సజ్జనుల గోష్టిగదలక ధర్మం చెఱగుచు ఎఱిగిన దానిని మఱువక నుష్టించునది సమంజస బుద్ధిన్ (భారతము)

